

శ్రీమాన్ కోమాండూరు వెంకటరామానుజా చార్యులు.

# అవతారిక.

---

"గంగ లేని దేశము త్యాజ్యము, కానపు లేని స్త్రీ గర్హ్యము, దక్షిణ లేని యజ్ఞము వ్యర్థము, విద్య లేని జన్మము నింద్య" మను శాస్త్రవచనంబుల యందొక్కటియైన విద్యలేనిలోపంబు వాపికొని యసదృశ కళాగరిమంబడసి మృదుమధుర పద్యరచనా విభూతిఁ "పద్మినీపరిణయం" బను సత్తమకావ్యంబు విరచించి సరసులగు రసికవరుల నలరించిన శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిని దృశ్యప్రబంధమొండు రచియింపఁగోరిన పెక్కండ్రు నాటకాభిమానుల యభిమతంబీడేర్ప "సముద్రమథనం" బను "విష్ణుమాయావిలాస నాటకము" ను బ్రదర్శనోపయోగంబుగ లలితపద భూయిష్ఠంబుగ విరాజిల్లఁ గృతినొనరించి మావార్త్రికిం గొడవుగ నర్పించి నందులకు కృతజ్ఞులము.

ఇందు నారదుని కలహనైపుణ్యంబును వెన్నుని భక్తవత్సలతయు మాయా ప్రవీణతయు, శివుని స్వాత్యతిశయంబును - గరిష్ఠంబును, సమంజసముగ విశదీకరింపంబడియున్నది. మఱియును వీరిట్లె పలు తెలుంగుల దేశభాషా సేవంజేయుకొఱకు నాయురారోగ్యైశ్వర్యంబు లొసంగి మనుప దయామయుండగు నీశ్వరు నిరతము వేఁడువాఁడ.

పత్రికాధిపతి.

---

శ్రీరాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

# సముద్ర మథనము

అను

# విష్ణుమాయావిలాస నాటకము.



(నాంది)

శ్రీరామామణియున్ ధరారమణియుం ♦ జిత్తంబు రంజిల్లఁగా
గారామొప్పఁగఁ గూడియుండఁ ద్రిజగ ♦ త్కళ్యాణసంధాయియై
నీరేజాసనముఖ్యులైన దివిజుల్ ♦ నిస్తుల్యమౌ భక్తితోన్
నారాధింపఁగ నుండు శ్రీవిభుఁడుమి ♦ మ్మశ్రాంతము న్బ్రోచు

చ. తరుణివిధంబుఁ గైకొనుచు ♦ దానవుల న్గికురించి మున్సుధన్
కరుణ సెలంగ వేల్పులకుఁ ♦ గౌతుక మొప్పఁగ బంచియిచ్చియున్
పరువఁపుఁగల్కిరూపమున ♦ భర్గుని నెమ్మనమందుఁ గూర్మియున్
మరులుదయింపఁజేయు నల ♦ మాధవుఁ డేలుమిము న్గృపామతిన్!

(నాంద్యంతంబున సూత్రధారుఁడు ప్రవేశించి తెరవంకఁదిరిగి)

ప్రేయసీ! తడవేల!

నటి:—ప్రవేశించి, ఆర్యపుత్ర! ఇదేవచ్చితి.

సూత్ర:—సఖీ! అభినవ నాటక సందర్శనోత్సుకులగు మహనీయు లీసభ న లంకరించి వేచియుండ మనవిూలాగు జాగుజేయఁ జనునా?

నటి;—ఆర్యపుత్రా! ఆలస్యంబునకు గొప్పకారణంబొకటి సంభవించుటఁ దడసితి క్షమింపుఁడు.

సూత్ర:—ప్రియురాలా! ఆ కారణంబేమి.

నటి:—నాథా! వినుండు మనసామాజికులలోనెల్ల శ్రేష్ఠుండును భరతశాస్త్ర పారంగతుఁడును నభినయవిద్యావిచక్షణుండును గానకళాధురంధ రుండు నఖిల నాటకప్రదర్శకులలోనెల్ల మిన్నయని పేరొందిరసజ్ఞులచే భూలోకభరతాచార్యుండని బిరుదంబునందియున్న మన మోహనదాసు నకు నీవేళ గొప్పయవమానము తటస్థించినది.

సూత్ర:—ఆ అవమానమా! ఎవరిచేత.

నటి:—ఆమోహనునకుఁ జిన్ననాఁడు విద్యాభ్యాసమొనర్చినగురుఁ డాతనిం జూడ నింతకుమున్న యేతెంచె.

సూత్ర:—గురువ్రుల రాక శుభమేకదా?

నటి:—అట్లువచ్చి యత్యున్నతపదవి నియుండు తనశిష్యునింజూచి సంతసించి తనవ్రేలనుండు నొక్క మహిమగల యుంగరం బాతని కాశీర్వాదపూ ర్వకముగ నొసంగె

సూత్ర:—అది మహాప్రసాదమేకదా?

నటి:—అప్పుడామోహనునిచేతియుంగర మేమఱుపాటునఁ గ్రిందఁబడెను.

సూత్ర:—ఆ! అది గొప్పతప్పే.

నటి:—అదిగాంచియాగురుండు మండిపడి "ఓరీదుర్మదాంధా! భరతశాస్త్ర నిపుణుండవని బిరుదంబునంది కన్నుమిన్నెఱుంగక నన్నవమానించితివి గానబిరుదంబు లేటఁగలయున ట్లొనర్చి నిన్ను నిర్భాగ్యునిఁజేతు" ననిదారుణంబుగఁబలికె.

సూత్రి:—అప్పుడు మోహనుం డేమిచేసె.

నటి:—అంత నారదుండు గురునిపాదంబులఁబట్టి యేమరుపాటున నేనొనర్చిన తప్పును క్షమింపుఁడని పలుమారు ప్రార్థించె.

సూత్రి:—అపరదూర్వాసుండగు నాతఁ డను గ్రహించునా!

నటి:—ఛీ! మందుఁడా! ఇంక నీ మొగంబుఁ జూచిన పాపంబు సంభవించు నని నిందించుచుఁ దనయిచ్చవచ్చిన త్రోవం జనియెను.

సూత్రి:—ఔరా! సుగుణగంభీరుండగు నాతని కిట్టిశాపము తటస్థింపవలసినదా? కలుగకేమి.

తే.గీ. అల సురేంద్రుఁడె దూర్వాసు ♦ నాగ్రహమున
కఠినమగు శాపమునఁగ్రాఁగ ♦ నిష్టమంది
మరల శ్రీహరికృపచేత ♦ మహితవిభవ
ములను గైకొనఁడే ముందు ♦ బలుపుచూడ.

ఆవిధంబుగా నీమోహనుండును దనకుఁ గల్గిన యీశాపంబువలన విముక్తుండై మరల నత్యున్నత పదవినందఁగలండు గాన దీనికై విచారింపక సత్వరంబ గానం బారంభింపుము.

నటి.—గీ. పుష్పములశోభఁ గోల్పోయె ♦ పూవనములు
నదుల నీరింకె తాపంబు ♦ లొదవె దిశల
మున్ను దూర్వాసుకోపాగ్నిఁ ♦ జెన్ను దఱిగి
పతితుఁడైనట్టి దేవేంద్రు ♦ పదవిఁ బోలె.

(తెరలో) ఔరా! దూర్వాసమహామునీంద్రుని శాపతీవ్రత.

నటి:—(తెరవంకఁదిరిగి త్రొక్కుపాటుతో) ఆర్యపుత్రా! త్రిలోకనాథుం డగు దేవేంద్రుఁడు బృహస్పతి సమేతుండై మిక్కిలి విషాదంబుతో నిట వచ్చుచున్నాఁడు నేననినమాటలు వినెనా యేమి!

సూత్రి:—ప్రేయసీ! యీతం డింద్రుఁడుగాఁడు. ఇంద్ర నేపథ్యంబుఁ దాల్చిన మనమోహనదాసు.

నటి:—ఔరా! ఈతని నైపుణ్యము నిజముగా నింద్రుఁడనియే తలంచితి. ఇట్టి వాని కిట్టిశాపంబు వాటిల్లునే. ఆదేవేంద్రునివలెనే యీతండును శ్రీపతి యనుగ్రహంబున నెప్పటి యున్నతపదవినంది సుఖించుఁగాత.

సూత్రి:—ప్రియురాలా! మనమిఁక నిచ్చటఁ దడయరాదు. సత్వరంబ తక్కిన యుపకరణంబుల నాయితంబుసేయవలయుఁ బోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.) ఇది. ప్రస్తావన

---

(అంతఁ బైఁజెప్పినరీతిని విషాదమున నింద్రుఁడును బృహస్పతియుఁ బ్రవేశింతురు

ఇంద్రు:—ఔరా! దూర్వాసమానీంద్రుని శాపతీవ్రత.

సీ. సకల కళ్యాణ ల ♦ క్షణ లక్షితంబైన
యైరావతంబేగి ♦ యబ్ధిఁ గలసె
సమరరంగోత్సాహ ♦ జనితమై యలరారు
యుచ్చైశ్శ్రవముపోయి ♦ యుదధిమునిఁగె
కామప్రదాయియై ♦ కడుసంతసముగూర్చు
కల్పద్రుమంబేగి ♦ కడలిఁజేరె
అఖిలభాగ్యోపేత ♦ మైవిభూతినొసంగు
కామధేనువుకన్ను ♦ బ్రామిసనియె.

తే-గీ. జరయు మరణంబులేంకుండ ♦ సలుపునట్టి
యమృతకలశంబు వార్థిలో ♦ నంతరించె
తక్కుఁగల వైభవంబు లు ♦ దధినిగలసె
అకట నాభాగ్య మేమని ♦ యనఁగవచ్చు.

బృహ:— దేవేంద్రా! చింతింపకుము మహామునులయాగ్రహం బట్టిదే!

ఆ-వె.　బ్రిహ్మపదవి నొంది ♦ భాసిల్లు నత్కడైన
నధమగతిని గాంచు ♦ నట్లుచేయు
నధముఁడైనవాని ♦ నత్యున్నతుని జేయు
ననఘమతులకోర్ధ ♦ మమలకృపయు.

ఇంద్రు:— గురువరా!

చ.　పొరపడినాఁడ నేననుచుఁ♦బొల్పుగ నామునిపాదపద్మముల్
శిరమునుసోఁక మ్రొక్కిడితి♦చిత్తమున న్దయజూపుమంచు నే
కరములుచాచి వేఁడితిని ♦ గావకయుండిన మమ్ముఁబ్రోవ నె
వ్వరుగలరంచుఁ గోర్ధముని♦వర్యుని వేఁడితి దీనవృత్తితోఁ

ఆవిధంబుగా నెంతప్రార్థించినను వినక నాపై మిగుల నాగ్రహించి "యోరోరి వంచకస్వభావా! నీవినయంబు లేక నాకడసాఁగి రావు నేనొసంగిన పుష్పదామం బొదలందాల్పక యేనుఁగుచే నేలంద్రోయించి త్రొక్కించితివి. గాన నీశాపం బనుభవించియే తీరుము. ఇంక నీమొగంబుఁజూచినఁ బాపంబు సంభవించు" నని తనయిచ్చంజనియె.

బృహ:— బృందారకేంద్రా! ఊరకయాశాపంబు నే తలఁచి తలఁచి చింతింపకుము. ముంగోపియగు నాజడదారి యాగ్రహించుటయే గాని యనుగ్రహించుటయన స్వప్నమందైన నెఱుంగఁడు.

ఇంద్రు:— ఆచార్యోత్తమా!

తే-గీ.　వ్రతము లొనరించినను నేమి ♦ యతులనిష్ట
జపము గావించినను నేమి ♦ తపసియగుచు

జడలు దాల్చిన ఫలమేమి । జనని మదిని
కరుణయను శాంతి లేకున్నఁ ♦ గలదె ఫలము.

బృహ:—సురేశా, మహామునుల లోపాలోపంబులు గణింప నిది సమయంబు గాదు. ముందెట్లు జరుగవలయునో యోచించుట క్షేమము. (అంత పటాక్షేపముగా జయంతుండు ప్రవేశించి)

జయం:—గురువులకు నమస్కారము భవదనుజుండగు నుపేంద్రునిసతి రమాదేవి యదృశ్యయైనది.

ఇంద్రు:—(తత్తరముతో) ఏమీ నాతమ్ముండగు నుపేంద్రునిసతి కమలాలయ యగుపడకుండఁబోయినదా? కారణంబేమి?

బృహ:—మునిశాపమే.

ఇంద్రు:—కటకటా? మందభాగ్యుండనగు నాకిట్టియిక్కట్లువాటిల్లుట సహజమే సర్వలోకరక్షకుండును శ్రీమన్నారాయణుని యపరావతారుండును నగు యుపేంద్రునకీయవస్థ చెల్లునే.

తే-గీ. అవుర! శ్రీనిలయుండనౌ ♦ హరి దయార్ద్ర
మానసుండౌచు ననుగావఁ ♦ బూనియుండ
నకట యాతని సిరిపోయె ♦ నగ్ని యినుము
గూడ సమ్మెటవ్రేటులఁ ♦ గుందినటుల.

బృహ:—త్రిదశాధిపా! చతుర్దశభువనంబులు భవత్పరిరక్షితంబులే గదా!

ఇంద్రు:—అవును. అట్లుండ నీవిభవలక్ష్మియంతయుఁ బోవుననుమాటలకె.

బృహ:—పదునాల్గు లోకములలక్ష్మిపోవుననిగదా తాత్పర్యము.

ఇంద్రు:—ఆచార్యవర్య! ఇప్పుడీస్వర్గలోకంబుఁజూడ నాకన్నులకు స్మశానంబువోలెఁ గన్పట్టుచున్నది. మతియు

చ. గడగడలాడె నీయొడలు ♦ కాళులుసేతులు నీరసంబులై
తడబడఁజొచ్చె చిత్తమున ♦ ధైర్యముబాసిభయంబు హెచ్చెడిన్

యెడమభుజంబు నేత్రమది ♦ యెంతయు స్పందనమాచునుండె నీ
వడువుననుండిన న్మనగ ♦ వచ్చునె తాలిమి నిల్వ నేర్చునే.

బృహ:—శతమఖా! కష్టసుఖంబులు దేహధారులగు పిపీలికాదిబ్రహ్మపర్యం
తము సహజముగాఁగల్గుచుండుట ప్రకృతిస్వాభావికమేగదా? దీని
కింతచింతిలనేల?

ఇంద్రు:—గురువరా! ఈదుర్లక్షణంబులఁగాంచ నింతకన్న నేదియో యొక
గొప్పముప్పు మూడనున్నదని తోఁచుచున్నది. (తెరలో)
దేవా! వచ్చెను. వచ్చెను.

జయం:—ఎవరు? (పురపాలకుఁడు ప్రవేశించి సంభ్రమముతో)

పుర:—దేవా! జయము జయము బలిదానవేంద్రునిదూతయఁట వజ్రదంష్ట్రుఁ
డనురాక్షసుఁడు.

ఇంద్రు:—కారణంబేమి!

జయం:—ఇప్పటి మనయదృష్టంబున కనుగుణంబగు కారణంబనియే
తోఁచుచున్నది.

భటు:—దేవా! విన్నవించెద. ఏ కారణంబుననో బలిచక్రవర్తి యీనాకంబుపై
దండెత్తివచ్చి మనపురరక్షకసైన్యములనంతయుఁ బారఁద్రోలి గమ
లాకరంబుసొచ్చు గజంబుకరణి నిరాటంకంబుగా మనపురంబు
సొచ్చి తానొక్కనివాసంబునవిడసి తన భటునిచే మీకేదియో
వర్తమానమంపుటఁగాంచి యాతనికన్న మున్న మీకీవార్తవిన్నవిం
పఁ బరుగువారివచ్చితి.

ఇంద్రు:—ఆచార్యోత్తమా! మనమిపు డేమిచేయఁదగు. మన యమ వరుణ
కుబేరులకును గృశాన నిరృతి సమీరులకును సర్వసైన్యములతో
సమరమునకు సహాయులుగా వచ్చునట్లు వర్తమానమంపుదమా?

జయం:—తండ్రీ! ఏలయీభ్రాంతి. మనకుఁగల్గు నీశాపఫలము మనప
రిజనులగు దిక్పతులకంటకుండునా?

ఆ-వె. అడవి వెదురులందు ♦ నగ్ని యుద్భవమంది
యందుఁ గొన్ని చెట్లు ♦ నాహుతిగను
గాల్చి కొన్ని తరులఁ ♦ గాల్పక విడచునే
సరవి నెల్లఁగాల్చి ♦ సమయుగాని.

బృహ:—నిజము కుమారునిమాట నిజము దేవేంద్రా! యష్టదిక్పతులమాట యటుండ భవద్రక్షితంబులగు త్రిలోకంబులకుఁ గాలము జయప్రదముగాదు.

ఇంద్రు:—అకటా! అయిన నిప్పు డేమి సేయుదుము.

జయం:—తండ్రీ! అధైర్యపడియెదవేల కష్టసుఖములు సమస్తజంతుకోటికి సమముగాఁ గల్గుచుండుట లెఱుంగవే.

చం. సకలజగంబు రక్షణకు ♦ సాక్షియునై నిగమస్వరూపుఁడై
ప్రకటితలీలఁ దేజరిలు ♦ భానుఁడు గ్రుంగుట లేదె నిత్యముఁ
వికలతనొంది సత్కళల ♦ వీడఁడె చందురుఁ డట్లుగుంది వా
రకలుషులౌచు నభ్యుదయ♦మందు చు నుండుట లేదె క్రమ్మఱన్.

ఇంద్రు:—(నిట్టూర్పువిడచి) కుమారా! వారికష్టసుఖంబులు లోకవర్తమానంబులకుఁ గారణంబులుగదా?

జయం:—తండ్రీ! ఇపుడుకష్టముగానున్నను మనకుసంభవించిన యీశాపము శాపావసానమున నేదేని యొకయభ్యుదయమునకుఁ గారణముగనే పరిణమించును.

ఇంద్రు:—(బృహస్పతితో) దేవా! కర్తవ్యమాలోచించి సెలవిండు.

బృహ:—(యోచించి) త్రిదశేంద్రా! కర్తవ్యమేమున్నది. దైవమిప్పట్టున మనయెడ విపరీతముగా నున్నాఁడు. అట్టియెడ దానవేంద్రుని దేరిపారఁజూడనైన మనకుఁగాని మనమిత్రులగు దిక్పతులకుఁగాని శక్యముగాదు. గాన మనమీయెడ నైరాశ్యనియఁదు వైరంబుగన్పిం

ఏక యాతఁడెట్లు చెప్పిన నట్లు నడచుకొనుట కాలానుగుణ్యము.

ఇంద్రు:—చిత్తము.

జయం:—ఓహో! దూరమున మహాడంబరముతో సగర్వముగా నిందువచ్చుచున్నవాఁ డతఁడే. యాదానవేంద్రునిదూత యని తోఁచుచున్నది.

(అంత వజ్రదన్తుఁడు ప్రవేశించును.)

వజ్ర:—(తనలో) అహాహా! యెంతకాలమునకు నాయొడలిమంట చల్లారినది. దుర్మార్గులగు నీవేల్పు లామాయలమారియగు వైకుంఠునిం జేరి యేమేమియో మాయోపాయంబులఁ బన్ని యసాధారణ ప్రతాపోన్నతులగు మాదానవసార్వభౌములం గికురించి వారిరాజ్యంబు లపహరించి రాజ్యంబులేలు నీపాడుదేవతులఁ జూడలేక నాకన్నులు మండుచుండెడివి. ఇపుడు మాభాగ్యవశమున మాయేలికయగు బలిచక్రవర్తి యీనాకంబుపై దండెత్తివచ్చి వేల్పులందోలి త్రిలోకాధిపతియయ్యె. (పెదవికఱచి) అయిననేమి? కుటిలాత్ములగు నీయమరులను బలుబాములం బెట్టి వీరిగర్వంబడంగునట్లు లీపదునాల్గులోకంబుల యందును కాలుపెట్టనీక పాఱఁద్రోలినఁగదా మాకుచిత్తశాంతిగల్గు. అట్లొనరింపక యావైరోచని నన్నుంబిలచి "వజ్రదన్తా నీవాయింద్రునికడకుంబోయి కఠినంబు పల్కుల నాతనిఁ దూలనాడక నావచనంబులుగా నిట్లుపల్కుము. దేవేంద్రా! వేల్పులగు మీ రీనాకంబుఁ గొంతకాలంబేలితిరి రాజధర్మం బనుసరించి నేనును గొంతకాలం బీనేల నేలఁదలంచిన వాఁడఁ గాన నీవు నీపరివారయుతుఁడవై మాయిచ్చవచ్చిన తావునకుఁ బొమ్ము లేదేని సంగరమ్మున కరుదెమ్మని రాయబారమంపె. ఎట్లైనను ప్రభువులమాట జరిపి తీరవలయును. (పరిక్రమించి) అదిగో యింద్ర బృహస్పతులును జయంతుండును గూరుచుండి యేమియో మాటలాడుచున్నారు. కాన నే నచ్చటికేగి ప్రభువునానతి నెఱవేర్చెదఁ ముందునకు నడచును.)

ఇంద్రు:—(లేనివికాసముతో) వజ్రదన్తా! ఎప్పుడురాక. మహానుభావుండగు మాయన్నగారికిఁ గుశలమేనా?

వజ్ర:—(గర్వముతో) నిర్వక్రపరాక్రమ శోభితులకుఁ గుశలముగాక మఱేమి?

ఇంద్రు:—ఆ మహనీయుండు తమ్ముండనగు నన్నెప్పుడైనఁ దలంచునా?

వజ్ర:—స్మరింపకేమి! నిరంతరము మీమీఁదిదే ధ్యానము. ఆ మహారాజిప్పుడీనగరంబునకు విచ్చేసియున్నవాఁడు.

ఇంద్రు:—(తనలో) ఈకష్టవార్త నీవఱకే వింటిని (ప్రకాశము) ఏమీ! మా యన్నగారగు బలిదానవ సార్వభౌముం డీపురంబునకు విచ్చేసెనా? మమ్ము సంభావించుటకే కాఁబోలు.

వజ్ర:—కాదు కాదు. ఆదానవేశ్వరుం డీనాకంబుఁ గొంతకాలంబేలఁదలంచి యిందుసొచ్చి తానొక్కనివాసంబునవిడిసి నీకిప్పగ్గ మాసమంపె.

ఇంద్రు:—అవహితుండనై యున్నాఁడ.

వజ్ర:—ఆవైరోచని మీతోఁ జెప్పుమనిన మాటలివి.

ఉ. ఏలితి పెక్కునాళ్లు దివి ♦ జేశ్వర నీవు దివంబు నింక నే
నేలదలంచివచ్చితిని ♦ నేఁడెర సత్రి దివంబుఁ జేరఁగా
బోలదు మీరునిందునిలఁ ♦ బొండొక తావున కట్లుగానినా
జాలము సేయరండు సమ ♦ రానకు వీరులఁజేని తెంపునన్.

బృహ:—దానవదూతా! అన్న రాజ్యంబు నేల నుత్సహింపక తమ్ముఁడాలంబు సేయుట నెందైనఁ గలదా?

ఇంద్రు:—అయ్యా! ఆమహనీయుఁడు రాజ్యపాలనంబొనర్చుట మాకెల్లరకును సమ్మతమే. దాని కీరాయబారము కావలయునా ఈక్షణంబుననే మేమాదానవేంద్రుని యాజ్ఞానుసారంబున మెలంగెదము

ఇంక నీవటిగి మామనవి యామహారాజునకు విన్నవింపుము.

వజ్ర:—ఆలాగే! (నిష్క్రమించును)

బృహ:—దివిజాధిపా! ఇంక మనమీనాకంబున నిలువరాదు. అంతఃపుర స్త్రీలనప్సరలను సురక్షితంబుగా నొక్కతావునకుం గొనిపోయి రక్షించుటకు మనజయంతకుమారున కాజ్ఞాపించి మనము బోవుదముగమ్ము.

ఇంద్రు:—(కన్నీటితో) కుమారా! నీవేగి మీయమ్మతో నామాటలుగా నిట్లుపలుకుము.

సీ. అలవులో మునిపట్టి ♦ వైకశ్యపునికూర్మి
కోడలివంచని ♦ కొమరుగాంచి
అసురుల తల్లియా ♦ నదితి గారవముచే
లాలించి మనుపంగా ♦ లీలవెలసి
కొమరొప్ప సిరితోడి ♦ కోడలవైమించి
హరికినవధూనిక ♦ వగుచు బఱిగి
రూపలావణ్య ప్రౌ ♦ తాపోన్నతుండునై
తగుజయంత కుమారు ♦ తల్లివగుచు

ఆ-వె మూండుకోట్ల వేల్పు ♦ ముగుదలు పరిచర్య
సల్పుచుండ వెలయు ♦ చానసీకు
కాలవశతఁబట్టి ♦ కడగండ్లు ప్రాప్తించె
నేమిచేయువాఁడ ♦ నేను సుదతి?   (అని.)

జయం:—(దుఃఖముతో) హా! దైవమా!

మ. తపముం జాలయొనర్చె నీమనము మో ♦ దంబంది యానందనన్
జపముల్జేసి పవిత్రుఁజూచుదనరెన్ ♦ జంభారిదుష్టాత్ములన్
గృపలేక న్దునుమాడె దుష్టవితతి ♦ న్గూల్చె న్జగంబెన్న ని
న్నెపుడున్ భక్తిదలంచు నాజనకుని ♦ న్బేలా వగన్గార్పఁగన్

బృహ:—జయంతా! ఊరడిల్లుము. దేవేంద్రా? ధైర్యంబవలంబింపుము కలిమిలేములు కావడి కుండలుగదా వీని కొఱకింత చింతించనేల.

ఉ. దైవనియుక్తిచే నిపుడు ♦ దైన్యమునొందుచు గుందనైతి మా
దైవమె సత్కృపామతిని ♦ దాగనుగొన్నపు డెప్పటట్లనే
చేవదలిర్ప నీపదవిఁ ♦ జెందిసుఖించెదు ధైర్యమూను మి
ట్లీవగనొందనేల దివి ♦ జేశ్వర దైవములేఁడె యన్నిటన్.

ఇంద్రు:—గురువరా! దైవము మనయెడలఁగల్గిన నిట్టియిక్కట్టులు ప్రాప్తించునా?

బృహ:—శతమఖా! ముందుకష్టములు గల్గఁగా సౌఖ్యములువచ్చును? గ్రీష్మము విజృంభించియే కదా వర్షముఁగురియుట.

ఇంద్రు:—మహాత్మా! మీప్రభోధవచనంబులచే నామనస్తాపంబు కొంత శమించినది. ఇఁకముం దేమి చేయవలయు సెలవిండు.

బృహ:—దేవేంద్రా! మనమిపుడు సత్యలోకంబునకరిగి యందు శారదా విభునకు మనకుఁగల్గిన యీ యాపదవినిపించి యీ మహాత్మునిం బురస్కరించుకొని క్షీరసాగరంబుకడకేగి యట శ్రీమన్నారాయణునిఁ బ్రసన్నుఁగావించుకొని మరల మనరాజ్యలక్ష్మినిం బడయుటకును దానవేంద్రుని నిర్జించుటకును నాదీనవత్సలుం డేమియుపాయంబుచెప్పునో దానింగైకొని మనకార్యంబుఁ జక్కబెట్టుకొన

వలయుఁ గాన మనమిందాలస్యంబు చేయక సత్వరంబరుగు దమురమ్ము.

ఇంద్రు:—చిత్తము (జయంతునితో) కుమారా? నీవేగి శీఘ్రముగా నంతః పురస్త్రీల హేమశైల ప్రాంతవనంబులకుం గొనిపోయి యట వారలనునిచి రక్షించుచుండుము. మేము క్షీరసాగరంబు కడకేగి దీనవత్సలుండగు శ్రీమన్నారాయణుని శరణంబువేఁడి యాదేవ దేవుని యనుగ్రహంబువడసి వచ్చెదము.

జయం:—తండ్రీ! అలాగే తమయాజ్ఞ శిరసావహించుచున్నాఁడను (నిష్క్ర—)

బృహ:—త్రిదశేంద్రా! ఇంక మనము పోవుదమురమ్ము.

ఇంద్రు:—చిత్తము (అని యిరువురు నిష్క్రమించిరి.)

(ప్రథమాంకము సమాప్తము.)



## ద్వితీయాంకము. ప్రథమరంగము.

(ప్రదేశము నాకలోకప్రాంతము చిత్రరథ మణిగ్రీవులను నిరువురు గంధర్వకుమారులు ప్రవేశింతురు.)

చిత్ర:—మణిగ్రీవా! మనసునాసీరునకు దూర్వాసమౌనిచే శాపంబుగల్గి యాతండు పదచ్యుతుండైనది మొదలు కడుంగడు విన్నసైయుండు నీమొగంబు నేఁ డేమికో మిక్కిలిసంతసంబున నున్నట్టు గన్పట్టు చున్నది. కారణంబేమి.

మణి:—చిత్రరథా! ఇంకనంతయు సంతసమె. మనయేలికయగు శతక్రతుం డచిరకాలంబున నభ్యుదయము నొందఁగలఁడు.

చిత్ర:—(సంతసముతో) హా! అటులనా? బలిదానవుని దుదముట్టింప దను జాంతకుం డేమైన యవతారమెత్తెనాయేమి.

మణి:—కాదు. కాదు. ఆసవిస్తారమంతయు విశదముగాఁ దెల్పెదను. వినుము. (నలుదిక్కులఁబరికించి) ఇందెవ్వరును లేరుగదా? ఈసమాచారము గోప్యముగా నుండఁదగినది.

చిత్ర:—ఎవరును లేరు. ఇఁక నాకర్ణంబుల కమృతసేచనంబుగా వింపుము

మణి:—సరియే ఆప్రకారంబుగా బలిచక్రవర్తిచే స్వర్గంబునుండి వెడల నడువఁబడి మనదివిజేశుండును, బృహస్పతియు సత్యలోకంబున కరిగి యందు హిరణ్యగర్భునకుఁ దమ కడగండ్లు తెలిపి యావాణీశునిచేఁ బురస్కరించుకొని క్షీరసాగరంబు కడకేగి యట భక్తవరదుండగు రమామనోహరుని పెక్కువిధంబుల స్తోత్రంబులొనర్ప నాజగత్పతి వారలకుం బ్రసన్నుఁడయ్యె.

చిత్ర:—(సంతోషముతో) ఆహా? శ్రీహరి ప్రసన్నుఁడయ్యెనా? ఏమి దేవేంద్రుని భాగ్యము తరువాత తరువాత.

మణి:—తరువాత నానిర్జరేశ్వరుఁడు తనకుఁగలిగిన శాపంబును దానవుఁడు దన్ను వెడలించి స్వర్గంబుఁగొనుటయు వచించి యెట్లైన నాదానవుని నిర్జించి మరల నెప్పటి త్రిలోకాధిపత్యం బొసంగి నన్నుఁ గృతార్థునిఁ జేయుమని రమాధవుని బలువిధంబులఁ బ్రార్థించె

చిత్ర:—అందుల కాదీనవత్సలుఁ డేమనియె.

మణి:—అంత నాజగత్పతి దేవేంద్రా! ఇపుడు మనమాబలితోడ యుద్ధంబు చేసి యాతని గెలువ సమయంబు గాదు. ఏలయన నాతండు ధర్మమార్గవర్తుండును శాంతుండును మహాతపశ్శాలియునై యున్నవాఁడు. మఱియు నాతండు రాజనీతియు వీరధర్మంబు ననుసరించి నీరాజ్యంబును గొనియెనే గాని మఱియొక విధంబుగఁ గాదు. అట్లుగాకనియు మున్ను హిరణ్యకశ్యపుఁడు మొదలగువారివలె లోకంబుల న్బాధింపక కడుధర్మంబుగా రాజ్యంబు నేలుచున్నవాఁడు అట్టివానిఁ దొలంగింప నీకు కాదుగదా! నాకైనను నలవిగాదు. అదియటుండ

మునిశాపంబుచే వినష్టంబగు నమృతకలశంబు మొదలుగాఁగల నీవిభవలక్ష్మినిక్ బడసితివేని యవ్వల నీరాజ్యంబు తనంతతానే సంక్రమించును. దాని కీయుపాయము నీవా వైరోచని పాలికింబోయి నైచ్యమనితలఁపక మృదుమధుర వినయభాషణంబులచే నాతనిమనం బాకర్షించి కొన్నినాళ్లాతనికడ నడంకువతో మెలఁగుచు తరువాత మాటమాటలవరుసగా నాతనితో నమృతపానంబుఁ జేసినఁగాని నీ కమరత్వము సిద్ధింపదుగాన మీరును మేమును గలసి సముద్రంబు మథించెదము. అందుదయించు నమృతంబు మనము సమముగాఁ బంచి కుడచెదమని వచించి యందులకాదనుజుని నొడఁబడునట్లొనరించి సాగరంబుఁ దరువఁ బ్రారంభింపుఁడు. అప్పుడు నేనుదానికిం దగిన సహాయం బొనర్తు" ననియానతిచ్చి యద్దేవుం డంతర్హితుండయ్యె.

చిత్రచి:—మణిగ్రీవా! ఇఁక మనమీ శుభోదంతము ధనప్రభుండగు కుబేరునకు విన్నవింతము రమ్ము (నిష్క్రమింతురు.)

## ద్వితీయాంకము. ద్వితీయరంగము.

(ప్రదేశము స్వర్గలోకమునందలి బలిచక్రవర్తి సభాభవనము.)

(అంత బలిచక్రవర్తియు శుక్రాచార్యుండును విప్రచిత్తును మఱికొందఱు దానవులు నుచితాసనంబుల నుందురు.)

బలి:—దానవులారా!

మ. తపముల్సేయుచునుండుసన్మునులఁబం ♦ తంబూని బాధింపఁగా
నెపుడుం జిత్తమున న్దలంపకుఁడుసుయే ♦ యేచోట్ల యాగంబులున్
జపముల్సేసెడువారి కెగ్గులెచటన్ ♦ సల్పంగఁబోరాదు మీ
రెపుడున్ ధర్మముదప్పకున్న సుకృతం ♦ బెంతేనియున్గల్గెడిన్. ౧౧

మఱియును, వినుండు.

చ. అమరుల యాఁడువారెచట ♦ నైనఁ గనంబడి రేని గౌరవం
బమరఁ గనుంగొనన్వలయు ♦ నంతియె కాని విమోహచిత్తులై
క్రమమును వీడి రేని మిము ♦ గష్టతరం బవు కట్టి శిక్షలం
దమరఁగనుంచువాఁడనని ♦ యాత్మ నెఱింగి మెలంగుఁ డెంతయున్

శుక్ర:—దానవులారా!

ఆ-వె. మానసంబునఁ గపటంబు ♦ మఱుఁగు పఱచి
వెలికి సుజనుల వలెఁ దోఁచు ♦ కలుషమతుల
నెఱిఁగి గురుతించి దండింప ♦ నెంచవలయు
నృపుల ధర్మంబు లివి మది ♦ నెంచుఁ డెపుడు.

బలి:—గురువరా! మీ హితోపదేశంబుల వలన నేఁగదా మేము మిక్కిలి శుభోదయంబుల నందితిమి. ఇంకను మీ వచనామృతంబులచే మా వీనులకు విందొనర్పుఁడు.

శుక్ర:—దానవశ్రేష్ఠా!

తే-గీ. కొలఁదివారల కెప్పుడైన ♦ గొప్ప పదవు
లొసఁగిఁ మన్నింపఁగాఁ బోల ♦ దసురనాథ
తారతమ్యంబుల నెఱింగి ♦ తగినవృత్తు
లొసఁగి రాజ్యంబు సేయఁగా ♦ నొప్పుఁ బతికి.

బలి—దేవా! మీ యాజ్ఞల శిరసావహించుచున్నాఁడ. (అంతఁ బ్రతీహారి ప్రవేశించి)

ప్రతీ:—దేవా! జయము జయము ఇంద్రబృహస్పతులు తమదర్శనం బపేక్షించి ద్వారంబుకడ నిలిచి తమ రాక విన్నవింపుమనుచున్నారు.

శుక్రు:—దానవేశ్వరా! నీవీసమయంబున నారలకు దర్శనంబు నొసంగక యనుపుట యుక్తము.

విప్రు:—అది మాకెల్లరకును సమ్మతము.

బలి:—గురువరా! అందువలనఁగలుగు ప్రయోజనంబేమి?

శుక్రు:—శత్రువుల సాహచర్యంబుచేఁ గీడునొందకుండుటయే.

బలి:—భృగునందనా! ఇపుడువారలు మనపై శత్రుత్వమునంబూని యుద్ధంబుఁ జేయ నేమైన దండెత్తివచ్చిరా?

శుక్రు:—సామంబుచేఁ గార్యంబుఁ జక్కఁబెట్టుకొనువారు యుద్ధమున కేల వత్తురు.

బలి:—స్వామీ! అటులయిన వారు మన రాజ్యం బపహరించుటకే యిట్లువచ్చిరని సెలవిచ్చెదరా?

శుక్రు:—అవును! ఈరాజ్యం బపహరించుటకుఁగాక నీపై దయగలిగి చూచి పోవచ్చిరని తలంచితివా.

విప్రు:—గురువులవారి పల్కులు యుక్తియుక్తములు.

శుక్రు:—బలీంద్రా! ధూర్తుల తెఱంగెంచుక వచింతు వినుము—

చ. వదనముచూడఁబద్మమన ♦ వచ్చును బల్కులతీరు నెన్నఁగా
సదమలమైన చందనము ♦ చాడ్పునచల్లదనంబుఁగూర్చెడున్
మదిపరిశోధనల్ సలుప ♦ మాటికి అంపముకన్న వాడియౌ
నిదియగుధూర్తవృత్తి తగ ♦ దిట్టిస్వభావుల నొద్దఁజేర్పఁగన్.

బలి:—ఆచార్యవర్య! సృగాలంబు లెన్నిప్రయత్నంబులొనర్చినను మృగరాజు నెదిరింపనేర్చునే.

శుక్రు:—వైరోచనీ! అటులనం జనదు, బుద్ధిబలముఁగలవారెవ్విధినైనను భుజబలముఁగలవారిఁ జయింపఁగలరు.

బలి:—బుద్ధియందు బృహస్పతిని మించు నీయనుగ్రహము మాయం

దుండ వారిబుద్ధిబలముమాత్ర మేమిచేయఁగలదు!

శుక్రు:—అటుగాదు. ఆయింద్రునియందు వారిజాక్షుసకుఁగడుంగడు పక్ష పాతమని యెఱుంగవా.

బలి:—దుష్టశిక్షణుండగు హరి ధర్మపక్షపాతిగాని కేవల యింద్రపక్ష పాతిగ్రైనయెడల నాశతమఖున కీయెడ నీయపజయమేల!

శుక్రు:—నీవటు దలంచుచుంటివా.

ఆ-వె. కడుభయంబుగూర్చు ♦ పిడుగులుపడిగాదె
యఖిలజీవదాంఱు ♦ యైనయట్టి
వర్షమొదవుచుండు ♦ వసుధ నీతీఱున
కష్టములె శుభముల ♦ కారణములు.

విప్ర:—అవును. ఆదేవేంద్రున కిట్టియిక్కట్టులు పలుమారులు కొండలవలె వచ్చి బెండులవలెఁ దేలిపోవుట సహజమైయున్నది.

శుక్రు:—అబలారాతికిఁగల్గు నపజయంబులు వానియభ్యుదయమునకట్లు కార ణంబులగుచున్నవో మనదానవుల విజయంబులు వీరికట్లు నాశనం బులకు హేతువులగుచున్నవి.

(తెరలో) మహాప్రభూ! వచ్చెను. వచ్చెను.

విప్ర:—ఎవరు! (తెరలో) సురముని నారదుఁడు.

బలి:—తడవుసేయక ప్రవేశపెట్టుము.

భటు:—(తెరలో) చిత్తము.

నార:—(ప్రవేశించి తనలో) "క. పోరోగిరఁబుఁజేసుక వారక మను మంచు బల్కె వాణీశుఁడు మున్నారీతి జరిగె, నీవల పోరులు కఱవయ్యె నుదర పోషణ మెటులో!" మున్నుబలిచక్రవర్తి నాకంబుపై దండెత్తివచ్చినపుడు సురాసురులకు సంగ్రామంబు జరుగుననితలంచి సంతసించితినిగాని పాపమావేల్పు టేఁడు మున్నే దూర్వాసు శాపోప

హతుండగుట నూరకయ తనరాజ్యంబు విడచి పోవలసె (స్మృతి నభినయించి) ఓహో! మఱచితి, అట్లు పదచ్యుతుండగు విబుధపతి మజ్జనకుఁడగు శతానందుని బురస్కరించుకొని క్షీరసాగరంబుఁజేరి యట శ్రీయిందిరావరుం బ్రార్థింప నాదీనవత్సలుండు ప్రసన్నుండై "పాకశాసనా! నీవు దానవ సదనంబునకుఁజని యా వైరోచనిం గొలుచుచుండి యాతని కమృతపాన కుతూహల ముదయింపఁజేసి మీరును దానవులునుగలసి కడలిమథింపుఁడు; ఆవల నే మీకుఁదగుసహాయం బొనర్తు"నని చెప్పి యద్దేవుం డంతర్హితుండయ్యెనఁట! ఇపుడు శచీవిభునకును దానవేంద్రునకును సఖ్యంబుగలుగవలసియున్నది. మహామేధావియగు శుక్రుం డిందుల కా బలి నొడంబడనీయఁడు. ఎవ్విధిచేనైన నే నాబలి నిచ్చకంపుమాటల లోఁబఱచుకొని యింద్రుని దన యొద్దఁజేర్చుకొనునటు లొనర్చెద. సపత్నీపుత్రులగు దేవదానవులొకచోఁజేరిన నిప్పులోనుప్పువైచినట్లగును; ఆవల సమరము దనంత దానే ప్రవర్తిల్లు, అగ్నికివాయువు సహాయమగునట్లు దైవసంకల్పమటులే యున్నది. తరువాత నాకుఁగావలసినంత పోరు విందు. (పరిక్రమించును.) (బలిమొదలగు దానవులు లేచినిలుతురు.)

బలి:—శతానందనందనా, వందనంబులు (నమస్కరించును.)

నార:—విజయోస్తు! దానవకుంజర.

బలి:—ఆయాసన మలంకరింపుఁడు.

నార:—(కూర్చుండును.)

శుక్ర:—దేవమౌనీ! ఎయ్యెడనుండి భవదాగమనము?

బలి:—దేవా! ఎచ్చటనుండి మమ్మనుగ్రహింప నిచ్చటికి విచ్చేసితిరి?

నార:—దనుజపాలా!

ఉ. శ్రీరమణున్భజించి సర • సీరుహగర్భునిజూచి శంకరుం
జేరిప్రణామముల్సలిపి • చెచ్చెరనంము భవత్ప్రతాపముల్

గోరినుతించుపల్కులను ♦ గొబ్బునవించుగుతూహలంబునన్
వారకనిన్నుజూడ నిటు ♦ వచ్చితి దైత్యకులాబ్ధి చంద్రమా.

బలి:—నేడు భవదాగమనంబున మద్దేహగేహంబులు ధన్యత్వంబునొందె.

నార:—దానవవంశ భూషణా!

సీ. తపమును శాంతంబు ♦ దయయునిష్టయుగల్గి
మహితమైనట్టి ధ ♦ ర్మము గడించి,
విభుదేంద్రుఁబోఁద్రోలి ♦ విష్టపత్రయమును
శాసించియర్థంబు ♦ సంగ్రహించి,
అఖిలోపభోగంబు ♦ లనుభవింపుచు నిష్ట
కామ్యార్థములనంది ♦ ఘనతఁబొంది,
శ్రీరమావిభు పాద ♦ చింతనంబున ముక్తి
కరతలామలకంబు ♦ గాఁగ్రహించి,

తే-గీ. లలిఁజతుర్విధ పురుషార్థ ♦ ములగడించి
సట్టిపురుష వరుండ వీ ♦ వగుచు నుండ
నిపుడు ధన్యుఁడ నని వచి ♦ యింపనేల?
అఖిల సంపత్సమేత! దై ♦ త్యాధినేత.

బలి:—అదియంతయు దమయాశీర్వచన ప్రభావమే! ఇప్పుడొకయంశ మీ యెడ ముచ్చటింపఁబడుచు నెద్దియైనర్చుటకును బాలువోకయున్నారము, దయచేసి తామాసందియంబుఁ దీర్పవలయు.

నార:—(తనలో) దైవాధీనముగా నావచ్చినకార్యమునకు సానుకూలమై యుండుఁగాక! (ప్రకాశము) దానికేమి, వచియింపుఁడు.

బలి:—ఇంద్రుఁడును దేవగురుండును మద్దర్శనం బపేక్షించుచున్నారఁట.

వారినిందురానిచ్చుట మంచిదా? లేక దర్శనంబొసంగక యనుపుట యుక్తమా?

నార:—(తనలో) వెనుకఁబోయినతీవె కాళ్ళందగిలినది. (ప్రకాశముగా) వీరవరా! పగవాఁడు దీనుండైవచ్చి నీదర్శనంబుఁగోర నిరాకరించి పంపుట నీబోటి ధీరోదాత్తునకు లక్షణంబుగాదు.

చ. ఘనతరశౌర్యముం గృపయు ♦ గల్గినమీటి మగండవంచు దా
నినుగొలువంగవచ్చె రజ ♦ నీచరనాథ! నిలింపభర్త, నీ
మనమున నించుకైన నను ♦ మానమునొందక బిల్వవిూసుధా
శనులుభజాపఁ బౌరుషము ♦ సాధిలనేలుము ముజ్జగంబులన్!

శుక్రు;—పితామహనందనా! ఇవియేటిమాటలు?

తే-గీ. అహితుఁడైనట్టి వానికి ♦ నాశ్రయంబు
నిచ్చినుంతురె లోకమం ♦ దెవ్వరేని?
అటులొసగ్గిన సౌఖ్యము ♦ నందగలరె?
అగ్గి కొంగునముడిచైచి ♦ నటులుగాక.

నార:—గురునందనా! సర్వధర్మంబాలెతెంగిన నీ కిటు లనియెదవేల?

క. తన కుపకారమొనర్చెడు
ఘనునకు నుపకృతియొనర్పఁ ♦ గానహజమగున్
అనయంబుఁగీడుసేసెడు
జనునకు మేలెంచవలయు ♦ జగతిని ధీరుల్.

(బలితో) కావున నోరాక్షసాధిపా! నీవవశ్యము పాకశాసనునిం బిలువ నంపుము. అవ్వలి సమాచారముం జూచుకొందము.

బలి:—(శుక్రునితో) గురువరా! ఇందులకుఁ దమరంగీకరింపవలయునని వేఁడుకొనుచున్నవాఁడ.

శుక్రు:—(యోచించి తనలోఁదలయూఁచి) దైవసంకల్ప మీవిధముగా నున్నది. నేనెన్ని హితోపదేశము లొనర్చినను కాఁగలది కాకమానదు. (ప్రకాశము) వైరోచనీ! "బుద్ధిఃకర్మానుసారిణి" యనునటుల ముందురాబోవు దానికనుగుణంబుగా నీకు బుద్ధిపుట్టుచున్నది. దైవసంకల్ప మటులుండ నీవేమిచేయుదువు? అటులే రప్పింపుము.

బలి:—చిత్తము. ఓరీ! ఎవరక్కడ?

భటు:—(ప్రవేశించి) మహాప్రభూ! యేమి ముదల?

బలి:—ఇంద్ర బృహస్పతుల నీయెడకుఁ దోడ్కొనిరమ్ము.

భటు:—చిత్తము (నిష్క్రమించి ఇంద్ర బృహస్పతులతో పవేశించి) అడుగో! దానవచక్రవర్తి పోయిదర్శింపుఁడు; నేబోయెద. (నిష్క్రమించును.)

ఇంద్రు:—(తనలో) హా దైవమా! నీసంకల్ప మవిలంఘ్య నీయముగదా? మున్నునాకుఁ త్రిలోకాధిపత్యం బొసంగి మన్నించి యిప్పుడీరక్కసునకు సేవగావించునటు లొనర్చితివిగదా!

తే-గీ. అత్రిసూనునిచే శాప ♦ మందినపుడు
స్వర్గమును వీడి సురలతో ♦ జనినయపుడు
అడవులందునఁ గష్టము ♦ లందునపుడు
కటకటా! దుఃఖమిారీతిఁ ♦ గలుగదయ్యె.

ఉ. ఆలినిబిడ్డల న్విభవ ♦ మంతయుఁగోల్పడి కాననంబులన్
గాలముపుచ్చుచున్ వెతల ♦ గాంచెడునాకిపు డక్కటక్కటా!
జాలివహించి దాయకు వె♦సన్ బరిచర్య లొనర్చుచుండఁగాఁ
గాలమువచ్చెఁ బుండుపయి ♦ గారము నుప్పును జల్లినట్లుగన్.

బృహ:—పురందరా! జాలినొందకు మింతకుమున్న నేను నీ కుపదేశించినరీ

దైన్యముం దోఁపనీక దానవేశునికడకు వినయంబున డాయంబొమ్ము.
ఇంద్రు:—గురువరా! తమయాజ్ఞానుసారముగ వర్తించెద (బలిని సమీపించును.)
బలి:—(లేచి; ఇంద్రుని కౌఁగలించుకొని.)
చ. అలఘు గుణాఢ్యుఁడై దనరు । నంబకనామయశఃసహాయశ్చీ
యలికులవేణికి న్మన జ । యంతకుమారునకుం శుభంబె వే
ల్పులకు ముదంబె నీవిపుడు । పూన్కి మెయిం గురువర్యుతోడ నీ
వలనికివచ్చు కార్యమును । వారక తెల్పుము నిర్జరేశ్వరా.
నార:—దేవగురూ! ఇటుగూర్చొనుము.
బృహ:—(నారదునిప్రక్క నాసీనుఁడగును.)
ఇంద్రు:—(వినయముతో) దానవకుల సార్వభౌమ! అందఱికిఁ గుశలమె. మనము మహనీయుండగు కశ్యపుని సంతతివారమగుట నిరువురము నీరాజ్య మనుభవింప సములము, అయుఁ బ్రతాపోన్నతుండవగు నీవీ విష్టపత్రయంబు శాసించుట మాకెల్లరకును సంతోషంబుగాన,
తే-గీ. అలఘుశౌర్యధనుండ వీ । వతిదయార్ద్ర
మానసుండవు, రాజ్యంబుఁ । బూనియేల
నిన్నుఁ గొలువంగవచ్చితి । నిప్పుడిటకు
ఆశ్రయమొసంగి రక్షింపు । మసురనాథ.
బలి:—(సగర్వముగాఁదలపంకించి) బిడౌజా! మున్నొకప్డు—
తే-గీ. రంభనాట్యంబుఁ జూడఁగ । రంబుబ్రీతిఁ
గబురు నీకంప నావేళఁ । గండకొ్రివ్వి
అరఁటిచెట్టిచ్చి పంపిన । యట్టిపొగరు
నేటికైనను దీరెనే । నిర్జరేంద్ర.

బృహ:—(తనలో) కటకటా! మహేంద్రునంటివాఁ డీదానవునిచే నిట్టి పోటుమాటలం బడవలసివచ్చెఁగదా, కాలవైపరీత్యము!

ఇంద్రు:—(తనలో) ఆహా! హృదయశూలములవంటి యీబలి నిష్ఠురంపుం బలుకులువిని సహించుట దుస్సహముగానున్నది. దితిజేంద్రా! యెఱింగియో యెఱుంగకయో మున్ను నేనాచరించిన యవినయం బులు మన్నించి నన్ను నీపరిజనులలోని వానిఁగాఁ జూచి రక్షింపుము. (అనిపాదములంబడును.)

బలి:—(ఇంద్రునిలేవనెత్తి) దేవేంద్రా! పెద్దవాఁడవు నమస్కరింప నర్హుండవు గావు. అగ్రాసనమునఁ గూర్చుండుము.

ఇంద్రు:—వలదు, మీసేవకుఁడిటులే యుండఁ దగినవాఁడు.

నార:—వైరోచన! ఈశక్రుఁడు నీ కంతటి యహితుఁడైనను నిపుడు నీకు "దాసుండనైతి" నని నీయొద్దఁ జేరినపుడు నిరసించుట నీబోటి ఘనునకుం దగవుగాదు.

మత్త. లావుగలిగినవాఁడవంచు ద । లంచి యీ మఘవుండు దా
సేవ జేయఁగవచ్చె దీనతఁ । జెంది సత్కరుణామతిన్
బ్రోవుమా తొలివైరమెన్నఁగఁబోలదీయమరేశుఁడున్
నీవులాతులె చూడుమా రజ । నీచరేశ గణింపఁగన్.

బలి:—తాపసోత్తమా! మున్నియింద్రుఁ డొనర్చిన యవినీతిం దలంచియిటులం టినేగాని యిప్పుడిట్టి యవస్థకుఁబాల్పడియున్న యీతనిం జూడ నామనంబు ప్రసన్నంబగుచునే యున్నది.

విప్ర:—(స్వగతము) ఏలినవారియందు దరిద్రదేవత ప్రసన్నంబగుచున్నది. తామింద్రుని యెడలఁ బ్రసన్నంబగుచున్నారు.

నార:—దేవేంద్రా! దయామయుండగు నీదానవేశుండు నిన్ననుగ్రహించెం భయ భక్తులుంగలిగి యీతనిం గొలుచుచుండుము.

ఇంద్రు:—ధన్యోస్మి ధన్యోస్మి! అనుగ్రహింపం బడితిని. (వీవనుగొని బలికి విసరుచుండును.)

నార:—(స్వగతము) దైవానుగ్రహముచే నేవచ్చినపని శ్రమలేకయే సానుకూలంబైనది. అవశిష్టమీ దేవేంద్రునిచే నెఱవేఱవలయును. (యోచించి) అమరేంద్రుఁడేల? నేనే ప్రయత్నించెద; గండుమాటలచే నానోటిముత్తెములు రాలునా! అంతమాత్ర మొనర్పలేనిచో బోడితలలకును మోకాళ్ళకును ముళ్లువైచి యాశ్చర్యముంగొల్పి సంతసించు నన్నుఁ గలహాశనుఁడందురా? లోకులెల్ల హసింపకుందురా? (ప్రకాశము.) దానవశ్రేష్ఠా! పరాక్రమమునంజేఁ త్రిభువనంబులం గొని శాసించితివిగాని,

బలి:—మహానుభావా! అసంపూర్తి వచనంబుచే నింకను నాకుఁ గొన్ని కొఱంతలుండునటుల సూచించుచున్నారు. దయయుంచి సెలవిచ్చినచో నవి సవరించుకొనియెద.

నార:—కొదువలేమి! ఒక్కటియే కొఱంత; అది తీర్చుకొనుట నీకు దుర్లభమేమో యని సందేహించుచున్నాఁడ.

బలి:—ఏమీ? నాకు దుర్లభమా? యవియేవియో సెలవిండు.

నార:—మాటవరుసగా నంటినిగాని బ్రహ్మ తలంచిన నాయువునకేమి కొరవ? నీకు సాధ్యముకాని దొకటిగలదా? చెప్పెదవినుము-

తే-గీ. అమరకోటికి దక్క నీ ♦ యఖిలమైన
దేహధారులు పుట్టుట ♦ తెగుటెగాని
యితర చందంబుగన డీని ♦ కింతలోన
యెద్దిగడియుంచినను సౌఖ్య ♦ మేమిగలదు?

బలి:—అవును. అట్లుమరణమొందకుండ నెద్దియైన యుపాయముగలదా?

నార:—కలదు చెప్పెద.

క. మరణము లేకుండుటకున్
జరాయువులుగల్గి ముదము ♦ జెందెదుకొఱకున్
వెరవొకటిగలదు చెప్పెద
నరయుము సద్దాన భద్ర ♦ మయ్యెడుమీకున్.

బలి:—కరుణించి యట్టి యుపాయం బెఱింగింపుఁడు.

దానవులు:—(ఉత్సాహముతో) నట్టి యుపాయము శీఘ్రముగా నెఱింగించి మమ్మమరులంజేసి యనుగ్రహింపుఁడు

నార:—వైరోచనీ!

తే-గీ. అమృతపానంబువలనఁ జ ♦ రాయువులును
నిత్యయౌవనములుగల్గి ♦ నిర్జరాళి
యఖిలసుఖముల వర్ధిల్లి ♦ రసురనాథ,
ఇంద్రుచందంబు నీక్షింపు ♦ మింతయేల?

(అని యింద్రునకు సైగఁజేయును.)

ఇంద్రు:—దానవ సార్వభౌమా! మేమొకవేళ బలహీనులమై ప్రతాపోన్నతులగు నసురనాయకులచే జయింపఁబడినను బరుల కసహ్యంబగు ముదిమిచేత నపాయకరములగు వ్యాధులచేతను భయంకరమగు మరణముచేతను నాశమొందక సంతతానందంబు నొందియుండుట యమృతపాన ప్రభావంబుననే గదా?

బలి:—(ఉత్సాహముతో) ఔనౌను!

బృహ:—రాక్షసాధిపా! ఎన్నిభోగభాగ్యంబు లార్జించినను జూచుటకు ననుభవించుటకు నసహ్యంబగు జరచేఁ బీడింపఁబడువాని కేమి సంతోషమున్నది?

సీ. నీలంపుచాయల ♦ నెగడు శిరోజముల్
రాలుచు వెస పాండు ♦ రత వహించు,
లావణ్యపుంజమై ♦ రహిమించు వదనంబు
దంతంబులూడగాఁ ♦ దఱుగువన్నె,
దేహపటుత్వంబు ♦ దెఱలి శుష్కించుచు
కడుఁగోత పుట్టించు ♦ ముడుతలువడు,
కనులకు వెసపొరల్ ♦ గ్రమ్ముచిత్తమ్ముస్వా
ధీనమొందదు వాక్కు ♦ దిటము చెడును,

తే-గీ. చెవుడు ప్రాప్తించు దండంబు ♦ చేతసమఱు
సతియు సుతులును బరిజనుల్ ♦ సఱకుగొనరు
మౌనముద్రయుఁ గైకొని ♦ మంచమునను
కష్టముల నట్టి కాలంబు ♦ గడుపవశమె?

దానవులు:—ఔను! ఇట్టి జరాభారంబు మోయుటకన్న మరణమొందుట యే మేలు.

శుక్రి:—(స్వగతము-తలయూచి) అది మీకెల్లరకు నాసన్నముగానే యున్నది. లేకున్నచో నీయింద్ర బృహస్పతుల యుపదేశములు రుచించుటయు నాహితవాక్యము వెగటుగఁ దోఁచుటయునా! (పెదవి విఱిచి) చావనిమ్ము దైవసంకల్ప మీవిధముగా నుండఁగా కానున్నది కాకమానదు. నడుమ నాకేమి వచ్చినది.

ఇంద్రు:—(స్వగతము) వీరి కమృతపాన కుతూహలము మెండగుచున్నది. కానిమ్ము, మఱియు ప్రోత్సాహించెద. (ప్రకాశము) దానవేంద్రా! అమృతపానం బాచరించినవారల లాభంబులు దెల్పెద నవధరింపుము.

ఆ-వే. జవ్వనంబు వీడి ♦ చనదు దేహంబున
పువ్వుబోండ్లతోడి ♦ పొందుసేయు
భాగ్యమెల్ల వేళఁ ♦ బడయంగనగు దప్పి
యాఁకలియును గల్గ ♦ వసురనాథ.

బలి:—(నారదునితో) మునిపుంగవా! మీవాక్యములచే సుధాపాన మొనర్చి యమరత్వంబు నొందవలయునన్న కుతూహలంబు నామనంబున మిక్కుటంబుగా గల్గినది. ఇపుడా యమృతంబు నెట్లు సాధింప వలయునో దయయుంచి యానతిచ్చితిరేని తగు ప్రయత్నంబుఁ జ్వరలో నొనర్చెద.

దాన:—ఆ యమృతము సాధించుటకు మా ప్రాణములనైన విడుతుము.

శుక్రు:—(స్వగతము) ప్రాణములు ధారబోయుదురేగాని, అమృతంబుఁ బడయఁగలరా? నారాయణుండు మిమ్ముసుధఁ గొననిచ్చునా?

నార:—బృహస్పతీ! ఊరకుందువేమి? పరస్పరమైత్రిచే విరాజిల్లు నీ దేవ దానవ సార్వభౌములలో నీ యింద్రుఁ డెట్టివాఁడో నిక వైరోచని యు నట్టివాఁడే గాన, నమృతావాప్తికిం దగువెర వూహింపుము.

బృహ:—(స్వగతము) ఇదివఱ కంపటము నూహించుకొన్నదియే గదా యీపన్నాగము! (ప్రకాశము) సురమునీ! అదియే యూహించు చుంటిని. మున్ను దూర్వాసుని శాపంబుచే నమృత కలశంబు మొదలయిన యింద్రుని విభవంబులు సాగరంబునఁ గలసెగదా?

నార:—ఔను! అయిన నిపు డేమి యొనర్చినవానిం బడయఁగలము.

బృహ:—ఇపు డాక్షీరవారధియందు, మందర నగంబు కవ్వంబుగానుంచి, వాసుకింద్రాడుజేసి ప్రపంచంబునంగల యోషధీ విచయంబు లన్నియు సేకరించి, యాకడలియందువైచి ఈ దేవదానవులెల్లరుం గలసి యాసాగరంబు మథింప నం దమృతం బుత్పన్నంబగు.

నార:—అసురనాథా! ఈ బృహస్పతి చెప్పిన యాలోచనము మిక్కిలి చక్కగా నున్నది. ఇందుల కీవేమందువు?

బలి:—(సంతసముతో) అంగీకరించితిని!

నార:—దానవులారా! మీ యభిప్రాయములేమి?

దాన:—అందులకు మేమెల్లరము సంసిద్ధులమై యున్నాము.

బలి:—(ఆదరముతో) దేవేంద్రా! ఇపుడు నీవు నాకుఁ బరమాప్తుండవైతివి. ఈ ఘనకార్యంబుపట్ల నాకు జేదోడు వాదోడుగానుండి కార్యసాఫల్య మగునటు లొనర్చితివేని యందుదయించున వన్నియు నీవె కొనుము. అమృతంబు మాత్రము మనమెల్లరము సమముగాఁ బంచికొందము.

ఇంద్రుడు:—(వినయముతో) ఎవరు కైకొన్న నేమి? మనలో మన కేమిభేద మున్నది, అటులె కానిండు.

బలి:—దానవులారా! ఈ దినమే మనమెల్లరము సముద్రమును మథింప నరుగవలయును. కావున మీరెల్లరుఁ దగు ప్రయత్నము లొనర్పుఁడు.

దాన:—చిత్తము (కొందఱు నిష్క్రమింతురు.)

నార:—దితిజేంద్రా! ఇఁక నేనటిగి వాణీశ గిరీశ రమేశుల కీయుదంతం బెరింగించి వారల నిక్కార్యంబునకుఁ దగు సహాయం బొనర్చునటులఁ జేసెద.

బలి:—చిత్తము, తాముమాత్రము తగు సమయంబునకు దయచేసి మాదండ నుండవలయునని ప్రార్థించుచున్నాఁడ.

నార:—దానవకుంజరా! ఇంత ప్రయత్నమొనర్చియుఁ దగుసమయమునకు మీ దండనుండి జరుగు కార్యక్రమములు గాంచక పోదునా, ఎంత మాట! ఇఁక నేఁబోయివచ్చెద, మీరుమాత్రము తలఁచిన కార్యమునకుఁ ద్వరపడుఁడు. (పరిక్రమించును.)

(బలిచక్రవర్తి మొదలగు దానవులు ఇంద్ర బృహస్పతులతో

నిష్క్రమింతురు.)

నార:—(సంతసముతో) ఇప్పటికి దేవేంద్రుని కడగండ్లు కడతేరినట్లే! మదోన్మత్తులగు దానవుల గర్వంబులు నాశమందినట్లే! ముందు ప్రవర్తిల్లఁబోవు దానిఁగూర్చి సంతసించెద (నృత్యముసేయుచు నిష్క్రమించును.) ఇది ద్వితీయాంకము.



## తృతీయాంకము. ప్రథమరంగము.

ప్రదేశము—కైలాసము.

(పార్వతీ శంకరులు పరివారముతోఁ బ్రవేశింతురు.)

పార్వ:—నాథా! నేఁటి చిట్టి ప్రయాణోత్సాహవశులై యున్నట్లగపడు చున్నారే కారణ మడుగవచ్చునా?

శివు:—దేవీ! వినుము దేవదానవు లెల్లరుఁ గూడి సాగరంబు మథింతురఁట! అయ్యెడకు వారిజాసనుండును నారాయణుండును వారలకు సహాయ మొనర్ప నరుదెంచి యున్నవారఁట! ఇక్కార్యంబునం దమకుఁ దోడ్పడరమ్మని వారిజాక్షుండు నారదునిచే సందేశ మంపెఁ; అందుచే మన వాసునికిని, వారలకుఁ దోడ్పడమని యిప్పుడె పంపితిని. ఇపుడా సముద్ర మథనం బెట్లు ప్రవర్తిల్లుచున్నదో కనుఁగొన నాకు మిక్కిలి కుతూహల మగుచున్నది, గాన సత్వరంబ మన మచటి కరుగ వలయును.

పార్వ:—నాథా! మీరచటికిఁ బ్రయాణం బనినది మొదలు నామనంబేమో కడు శంకించుచున్నది.

శివు:—దేవీ! స్త్రీలు సహజభీరుత్వముచే నన్నిటఁ శంకింతురు. ఇపుడు మన మచటికేగి వేడుకఁ జూతుమే కాని చేదుమెయ్యేమా?

పార్వ:—నాథా! నాదక్షిణ నేత్రమేమో యదరుచున్నది. (విచారముతో)

తే-గీ. త్రిపురులం బరిమార్పఁగాఁ ♦ దివురువేళ
సామజాసురు సమయింప ♦ జనెడునాఁడు
నాథ మిముఁబంప బెదరని ♦ నామనంబు
కలఁగుచున్నది చేఁబెట్టి ♦ కలఁచినటుల!

శివు:—దేవీ! ఇందు భయమునకుఁ గారణంబులేదు. లెమ్ము! ప్రయాణమగుము.

పార్వ:—(చెవియొగ్గి) ప్రాణేశ్వరా! అటు వినుండు అకోలాహలమేమి? ఆయార్త ధ్వనులేమి?

శివు:—(విని) ఔను! యేమిగో ప్రమాదము వచ్చినది.

(అంత బ్రహ్మాదిదేవతలు దానవులు సంభ్రమముతోఁ బ్రవేశించి)

మృత్యుంజయా! హాలాహలము. రక్షింపుము!! రక్షింపుము!!!

శివు:—రక్షించితిని; భయము మానుఁడు.

(దానవులు శివుని పాదములఁబడుదురు.)

శివు:—అభయమొసఁగితిని, భయమునకుఁ గారణముఁ దెల్పుఁడు.

బ్రహ్మ:—(కేలనిర్దేశించి)

క. హాలాహల మయ్యదియే
యోలిఁ లోకముల భస్మ మొనరించుచు దా
నీలాగు వచ్చుచున్నది
చాలఁగ దయయుంచి దాని ♦ సమయింప గదే.

శివు:—దేవదానవులారా! నే దానింబట్టి శిక్షించెద, మిమ్ము రక్షించెద, భయము మానుఁడు (పార్వతితో) దేవీ! నే నాకాలకూటముంబట్టి రూపుమాపి వచ్చెద నీ విటనుండుము.

పార్వ:—నాథా! సాహసమువలదు. లోకంబులన్నియు భస్మీభూతంబులుగా నొనర్చుచు భూనభోంతరాళంబుల దానయ్యె విజృంభించు

చున్న యాహాలాహలంబున కెదురేగిన సహాయము రాఁగలదు.

బ్రహ్మ:—(భయముతో) దీనవత్సలా! మీరిటుల మీనమేషములు లెక్కించుచున్న హాలాహల మదిగో నాలుకలు జాచుచు సమీపించుచున్నది.

శివు:—(హాలాహలమువైపు చేయెత్తి) హా! నిలువు మచ్చట లోకముల నిర్మూలింపకుము. ఇదె వచ్చితిని. దేవతలారా! భయమొందకుఁడు. ఆ కాలకూట మటులే నిలచినది. నేఁబోయి దానిం గబళించెద.

పార్వ:—నాథా! ఎందులకట్లు సాహసించెదరు. ఈ దీనురాలి మొఱ నాలకింపుఁడు.

తే-గీ. అన్నిటికిఁదానె కారకుం । డగుచునున్న
హరియె దీని నుపేక్షించి । యవలనుండ
యెట్టిగొడవయు నిసుమంత । యెఱుఁగనట్టి
తాము విషమేలఁ గబళింపఁ । దరలవలయు?

శివు:—దేవీ! నారాయణుం డేకారణంబుననో దానూరకుండెనని నేనును మిన్నకుండిన లోకంబు నాశమందదా? యిది యటుండనిమ్ము.

చ. భయమును జెంది దీనులయి । పాదముల న్బడినట్టివారలఁ
గయికొని రక్షణన్సలుపఁగాఁ దగు । సజ్జనులైనవారికిన్
దయవిడనాడి వారి విప । దంబుధి ద్రోచిన దుర్జనాళికె
న్దయిన శుభంబుగల్గునె । మహాపదలంబడి ద్రుగ్గమకుందురే!

పార్వ:—ప్రాణేశ్వరా! అట్టి ధర్మము లన్నియు దమ దయవలన నించుక యెఱుంగుదును. చూచిచూచి యాభయంకర హాలాహలంబు పయికి మిమ్మంప మనస్సు రాకున్నది. యేమిసేయుదును!

శివు:—శైలరాజపుత్రీ! మనకెన్ని యాపదలువచ్చిన నాపన్నులగువారిం గాపాడ త్వరపడవలయు; (సంరంభముతో)

పంచచామరము.

[illegible] జగంబులన్ స ♦ మగ్రకీలలంగాల్చుచున్
కఠోరవృత్తి నొప్పుచున్న ♦ కాలకూట ముంచెగన్
హఠంబుగంబూని బట్టిలోక ♦ మాతసౌఖ్య మొందగన్
తటాలునన్ హరింతు దేవ ♦ దానవాళిఁ బ్రోచెదన్.

(అనికాలకూటముపై కుయకుమ నిష్క్రమించును.)

పార్వ:—అహా! ఆర్తత్రాణ పరాయణ! శ్రీమన్నారాయణా! శరణాగతుల గాపాడ నమకట్టి నాపతి భయంకరంబగు గరళంబుఁ గబళింపఁ బోయె; ఓజగన్నాథా! ఆ హాలాహలముచే నావల్లభుని కట్టి యపాయమును గలుగకుండఁ గాపాడుము.

బ్రహ్మ:—అమ్మా! లోకనాథుండగు రుద్రుండు భీషణాకారంబుతో విజృంభించు కాలకూటంబు నంతయు తనచేత నాకర్షించి యొక్కమాఱుగా మ్రింగుచున్నాఁడు. ఇఁక లోకములు రక్షింపఁబడినవి.

ఇంద్రు:—(సంతసముతో) భక్తవత్సలుండగు పరమేశ్వరుం డదిగో! బిగ్గరగా నేమియో వచింపుచు నిటువచ్చుచున్నవాఁడు. అది వినుఁడు.

(తెరలో) ఓ దేవదానవులారా! హాలాహలము నంతయుఁ బట్టి భక్షించితి. ఇఁక మీభయంబులు మాని శీఘ్రముగాఁ గడలిం దరువఁ బొండు. జాగుసేయవలదు.

బ్రహ్మ:—భక్తవత్సలా! లోకములకు ముదావహంబయ్యె. అమ్మా! సంతసంబొందవె. వచ్చెదము.

పార్వ:—మంచిది. (దేవదానవులు నిష్క్రమింతురు.)

పార్వ:—(సంతసముతో) భయంకర హాలాహల పానమొనర్చి లోకములఁ

గాపాడి వచ్చు నానాథున కెదురేగి సంభావించెద.

(పరిక్రమించును)

శివు:—(ప్రవేశించి విషతాపముచే మూర్ఛ నొందును).

పార్వ:—అయ్యయ్యో! నానాథునకు విషముతలకెక్కి మూర్ఛఁ జెందె ఇందులకు నేనేమి సేయుదును? (శివుని శరీరమంటిచూచి) కట్టా! శరీరమంతయు ముచ్చెమటలు గ్రమ్ముచున్నవి, అవయవములు స్తంభీభూతములగుచున్నవి. హా! కష్టము! కష్టము!. (మూర్ఛిల్లును. సఖులు శైత్యోపచారమొనర్తురు.)

పార్వ:—(మూర్ఛఁదేరి) ఓ దైవమా! మాకొఱకే యీ సముద్రమథన మేర్పడినదా? ఓ దేవదానవులారా! గరళంబుచే మరణంబునొందకుండ నా నాథుఁడు మిమ్ముం గాపాడెనే, ఇప్పు డేలైన యుపాయముచే నాపతి యాపద న్బాపలేరా? ఓ దీనదయాపరా! ఇందిరావరా! ఎందున్నావు?

సీ. విసతాపమున సొక్కి ♦ పసదూలి యున్న నా
పతిని రక్షింపవే ♦ పద్మనాభ
శరణాగతులఁ బ్రోవ ♦ సమకట్టినట్టి నా
వల్లభుఁ గావవే ♦ వాసుదేవ
నిరతంబు నీపాద ♦ స్మరణ గావించు నా
కాంతుని మనుపవే ♦ కమలనేత్ర
అనిశంబు సుజనాళి ♦ నరసి రక్షించు నా
ప్రభుని గాపాడవే ♦ భక్తవరద

తే_గీ. దిక్కు నీవని నమ్మితి ♦ దివిజవంద్య
చేరఁగావచ్చి యేలవే ♦ శేషతల్ప

అభయ హస్తంబొసంగవే ♦ యార్తపాల
కరుణ జూడవె యిదిరా ♦ వర ముకుంద.

(విష్ణు ప్రవేశము.)

విష్ణు:—(పార్వతి శిరంబుపై కరంబుంచి) అమ్మా! శైలరాజసుతా, జాలి నొందకుము లెమ్మా, నీపతి విషతాపముచే మూర్ఛనొందుట యెఱింగి మఱల సాగరంబు మథించు తఱి సంభవమృతాంశుఁ డుద్భవింప వానిం దెచ్చితి. ఇపు డీవిసపు మేలరి శిరంబుపై నీ సుధాకరు నిల్పితి మేని యీతం డీవిషతాపంబువలన విముక్తుండై సౌఖ్యమొందు గాన నట్లొనర్తము రమ్మా.

పార్వ:—(నమస్కరించి) దేవా, మహానుభావా! అట్లులే యొనర్చి నమ్ముద్ధరింపుము.

విష్ణు:—(చంద్రుని శివుని శిరంబున నుంచును.)

శివు:—(మూర్ఛఁ దెలసి లేచి, విష్ణునిం గాంచి సంభ్రమముతో) వాసుదేవా! నమస్కారము.

విష్ణు:—(శివునిం గౌఁగలించి) ఉమాపతీ! ఇపుడు సముద్ర మథనంబగుచున్నది. నీవు విషతాపంబుచే మూర్ఛనొంద చంద్రుని నీ శిరమందుంచి యీ విషతాపంబు మాన్పవచ్చితి. ఇపు డమృతంబు వొడము సమయము దాపయ్యె; ఇఁక నే నిందుఁ దడసితినేని కార్యంబు చెడు గాన నే నరిగెద.

శివు:—దేవా, జగన్నాథా! చిత్తమటులే కానిండు. (విష్ణు నిష్క్రమణ.)

పార్వ.—ప్రాణేశ్వరా! దీనవత్సలుండగు రమారమణుని యనుగ్రహముచే మనము బ్రతికితిమి. విషతాపముచే మీరు చాల బడలియున్నారు; ఇంచుక సేపు భద్రవటంబు నీడన విశ్రమింతము రమ్మా.

శివు:—దేవీ! అటులే. (నిష్క్రమించిరి)

——:0:——

## తృతీయాంకము—ద్వితీయ రంగము.

(ప్రదేశము-సముద్ర ప్రాంతభూమి- విద్యాధరమిథునము ప్రవేశించును.)

విద్యా:—ప్రేయసీ! దీనావనుండగు శంకరుని వలన కాలకూటముచే నాశమందనున్న జగంబులన్నియు మరల నుద్ధరింపఁబడినవి. అదిగో! సురాసురులు సాగరంబును మథించుచున్నారు; మన మచ్చటికరిగి యావేడుకఁ జూతమురమ్ము.

వి. రి:—ప్రియా! చూడు మాసాగరంబునఁ బుట్టు తరంగ సముదాయంబుల చేత నందు మహా భూతంబు విజృంభించి చరించు కరణిం దిరుగు నా మందర నగంబువలనఁ గలుగు భయంకర శబ్దంబులచే కవ్వపుం గొండకుఁ దాడుగాఁ జుట్టఁ బడిన మహానుభావుండగు వాసుకి యొనర్చు భూత్కారంబుల చేతను దేవదానవులొనర్చు కోలాహలంబులవలనను గలిగిన మహా ఘోషంబుచేఁ జెవులు దిమ్మెక్కుచు నా ప్రదేశమునకు వచ్చుటకు వెఱగు దోఁచుచున్నది. కాన మన మిటనుండియే యా వేడుకఁ జూతము.

వి. దు:—సఖీ! అటులే గానిమ్ము.

వి. రి:—ప్రియంవద! పాలకడలిం దఱచునెడ నందుఁ దేలిన మిసిమిముద్దలవలె వెల్లనగు మేనులతో నందుఁ దిరుగు నా వింత వింత జంతు సముదాయంబు లెచ్చటివి? ఆవైపున క్రొత్తక్రొత్తయు మెఱుంగులవలె నొప్పు మేనులం గలిగి యందు విహరించు నాయంచయానలెవ్వరు?

వి. దు —ప్రియభాషిణీ! తెల్పెద వినుము.

మ. సుదతీ! వేలుపుటావుజూడుమదెయ♦చ్చోనుండెనుచ్చైశ్రవం
బదె యైరావత మాదెసన్ వెలయు న♦త్యానందసంధాయియా
నదియే కల్పక మావల న్దిరుగు నా ♦ యబ్జాక్షులే యచ్చరల్
నుదయంబైరి మహోదధిన్ దరువఁగా ♦ నుత్ఫుల్లపత్రేక్షణా.

వి. రి:—ప్రియుఁడా! ఆవైపు తిలకింపుము.

తె-గీ. కనకపీఠంబున వసించి । కమలభవుఁడు
మున్నుగాఁగల వేల్పులు । సన్నుతింప
వాణి గిరిజయు శచి మొదల్ । వనితలెల్ల
సేవలొనరింప నలరునా । దేవియెవరు?

వి. దు:—ఆమెయే సకల జగజ్జననియు సకల సంపత్ప్రదాయినియు నగు శ్రీమహాలక్ష్మి. మున్నొకనాఁడీ కలువల జవరాలు కారణంబున శ్రీహరిపై నలిగి సాగరంబులోఁ బ్రవేశించె. ఇప్పుడీ కడలి గలచునెడ నిందుద్భవించి పరగల శౌరిఁ జేపట్టెను.

వి. రి:—నాథా! నేఁడు మనమెంత ధన్యులమైతిమి. ఆఁకలి దప్పులడంచి వాతాతపంబుల కోర్చి కాయంబుల శుష్కింపఁ జేసికొని తలక్రిందుగాఁ దపమాచరించు మహాత్ములకు సయితము గోచరుండగు నీ వైకుంఠుని దన కటాక్షంబుచే నాశ్రితులకైన నిష్టకామ్యార్థంబు లొసంగి రక్షించు నీ యిందిరాదేవి గాంచఁ గలిగెను. ధన్యోస్మి! ధన్యోస్మి! (ఇరువురు నమస్కరింతురు).

వి. రి:—ప్రాణేశా! అటుచూడుము. ఎవతెయో యున్మత్తవలె వికారమగు సంగవిన్యాసముతోఁ జేత నొక కుండనిడుకొని తూలుచు వచ్చుచున్నది, అది యెవ్వతె?

వి. దు:—ప్రాణదయితా! అది వారుణియను నొక స్త్రీ, సురాభాండముతో నీ సాగరంబునఁ బుట్టినది. దానిం దరుముచుఁ గొందఱు రక్కసులిటు వచ్చుచున్నారు. మనము వీరియెదుట నుండరాదు. తొలఁగి చూచుచుండమురమ్ము.

ఇరువురు:—(నిష్క్రమింతురు.)

—:0:—

## తృతీయాంకము.—తృతీయరంగము.

(అంతఁ బైఁజెప్పినరీతిగా కల్లుకుండఁగొని వారుణియు దానిఁ దఱుము కొనుచు నిరువురు రాక్షసులు ప్రవేశింతురు.)

మొద:—పిల్లా! నీవెవరు? చక్కని చుక్కవలె నెక్కడకుఁబోవుచున్నావు?

వారుణి:—(కైపుచేఁ దడఁబడుచు) నే నెవ్వరో నాకెఱుక లేదు. చక్కని చుక్కయే కాఁబోలు నాపేరు; నే నెక్కడనుండి యెక్కడకుఁ బోవుచున్నానో యూహింపఁజాల. (అని సోలుచున్నది.)

రెండ:—(వారుణి చేయిపట్టుకొని) సుందరీ! నాకెంట వత్తువా నీకు కావలసినన్ని నత్తలు చేపలు నాయింటఁ దినఁగల్గుదు. ఎల్లప్పుడు నేను నీవెంటఁ గుక్కవలెఁ దిరుగుచుందును.

మొద:—ఓరీ! నీ పొట్టపొడవ. పెద్దవాఁడనగు నేను దీనిఁ బెండ్లాడెద. ఇదినీకు తల్లియగును.

రెండ:—ఒరే! ముసలివాఁడా. ఇదినాకు పిల్లయగును. నా పిల్లలకు తల్లి యగును. నోరు మెదిపితేని మఱినీకుఁ గాయశుద్ధియగును. మూఁడు కాళ్ళ ముసలి ముండకొడుకునకుఁ బెండ్లెందుకురా? నీమైఁబడి యేడువనా?

మొద:—ఓరీ! పొగరుబోతురఁడా! పుట్టి మూఁడునాళ్ళుగాని నీకెందు కురా పెండ్లాము? చంకఁబెట్టుకొని వీధులం ద్రిప్పుటకా? ఏమే పిల్లా! ముందు నేను నీముఖముఁ జూచితిని. అందుచే నీవు ముందు నా పెండ్లమగుదు, రమ్మ నావెంట. (అని దానిచేయిఁబట్టుకొనును.)

రెండ:—(వానివారించి) ఓరీ! మందమతీ! ముందు నీపెండ్లమైన నిది వెనుక నెవరి పెండ్లమగునురా.

మొద:—ఏమో! నేను చచ్చినవెనుక దానియిష్టము నీయిష్టము.

రెండ:—అటులైన నిదిగో యిపుడే చచ్చితివి. (అని కత్తితోఁ గొట్టఁబోవును.)

మొద:—నాయనో! చంపవద్దు. దీనిని నీవే పెండ్లాడుము. నాకీ పెండ్లాము వలదు, పేలాలువలదు.

రెండ:—జాగ్రత! ఇఁక దీనిజోలి యెత్తితివేని నీడొక్కలో నిద్రపోయెద.

మొద:—(పోవుచు) చూడునాదెబ్బ. ఇపుడేపోయి బలిచక్రవర్తికీ సమాచారంబుఁజెప్పి నీపని బట్టించెద. (నిష్క్రమించును.)

రెండ:—బలిచక్రవర్తికీగండము గడచినప్పటి మాటగదా! (వారుణితో) చిన్నదానా! ఇఁక వస్తువా, నావెంట, ఆచేతి కుండలోనిదేమిటి?

వారుణి:—హి. హి. హి. హి. అదియేమినో యెఱుఁగనే యెఱుగవా! అదియేషోకు! అదియే బ్రహ్మానందము! అదియేసుర! అది యెఱుంగనివారి బ్రతుకేల దాని మహిమనీకు జెప్పెదనువినుము.

సీ. ధనవంతులగువారి ♦ ధనమెల్లహరియించి
    పాకముందరనుండు ♦ బంట్లఁజేయు
నాలుబిడ్డలయందు ♦ నమరెడి ప్రేమంబు
    వేగమే దరలించి ♦ జోగిఁజేయు
దాస్యవృత్తినిబూని ♦ ధనము నార్జించుచుఁ
    దనసేవనొనరింప ♦ ననువుజూపు
మనవంటివారల ♦ ఘనస్నేహబద్ధుల
    గావించి యాడించుఁ ♦ గౌతుకమున

తే.గీ. వేయుచెప్పఁగనేటికి ♦ వినుము మద్య
    పానమందున గలయట్టి ♦ పరమసుఖము
బ్రహ్మ హరియును హరుఁడైనఁ ♦ బడయలేరు
    పుణ్యజనులకె యీసుర ♦ పొందఁగలుగు॥

దానవుఁడు:—(వికటహాసమొనర్చుచు) అటులనా! నాపుణ్యముచేతనే నీవును సురయు లభించుట. రమ్ము త్రాగుదుము. (ఇరువురు మద్యపానమొనర్చి నాట్యముసేయుచు)

మత్తకోకిల.

దాన:—ఇన్నినాళ్ళకు నీదయామతి ♦ నీసుర స్తనుఁగొంటిఁగా
వారు:—ఎన్ని వస్తువులైన నీసుర ♦ కెంపుసాటికి రావుగా
దాన:—కన్నె! నా వెనువెంట నిమ్మిక ♦ కౌతుకంబును మీఱఁగా
వారు:—నన్ను రమ్మని యందువే
దాన:— ఎల ♦ నాగ! నిన్విడ నేర్తునే.

(దానినెత్తుకొని దానవుఁడు పాఱిపోవును)

విద్యాధర మిథునము:—(మరలఁ బ్రవేశించును.)

వి. రి:—వల్లభా! మాన్నులగు రక్కసులు సురాభాండంబుఁ గైకొని తమ ప్రయత్నములన్నియు ఫలించినటుల సంతసింపుచు దానిం ద్రాగుచున్నారు.

వి. డు:—ప్రాణేశ్వరి! అదురాత్ములకిదియే రమావరుఁడు దక్కనిచ్చునది.

వి. రి:—అటులైనఁ బాపము! తక్కిన వన్నియు దానవులకంట దుమ్ముగొట్టి వేల్పులే గొందురాయేమి?

వి. డు:—పసునఁబోవు: గూరల రుచు లకు నేల?

వి. రి:—సుముఖా! అదిగో కడలియందుండి సంపూర్ణచంద్ర సదృశ ప్రకాశమానుండును మందస్మిత సుందర వదనారవిందుండును; ఆకర్ణాంత విశాలనేత్రుండు నాజానులంబిత బాహుండును మనోజ్ఞ పీత వసనాలంకృతుఁడును ప్రియదర్శనుండును నగు నామహాపురుషుఁడు తన కరంబునఁ గాంచన కలశం బొకటి వెలయుచుండ నేతెంచు నాతం డెవ్వఁడు?

వివ్యా. దు:—సుముఖీ! ఆయమృత కలశహస్తుండు-

తే_గీ. ఆయుర్వేదశాస్త్రాది పారగుం ♦ డతిదయార్ద్ర
మానసుం డౌషధజ్ఞుండు ♦ మంత్రవేది
అఖిలరోగంబులు హరించు ♦ నతఁడు నికరుణ
వనితయాతఁడు ధన్వంత్రి ♦ యనఁగఁ బరఁగు.

వి. రి:—అమ్మచెల్లా! కొంపమునిఁగినది. ఆధన్వంత్రిచేతి సుధాకలశంబును బలిమిచే నపహరించి రాక్షసు లదె పఱుగువారుచున్నారు.

వి. దు:—చెలీ! భయములేదు. బృందారకు లందఱు నిందిరా రమణుని పాదములంబడి యా యమృతంబు తమ కొసంగుమని మొఱలిడ నా భక్తవత్సలుండు కనుసన్నలచే వేల్పుల కభయ మిచ్చుచున్నాఁడు.

వి. రి:—ఈ చిత్రముఁగాంచుము. ఎవ్వరో యొక జగన్మోహనాకారియగు సుందరాంగి యిచట కరుదెంచుచున్నది. దాని పిరుందన మోహ విభ్రాంతులై సుధా కలశంబుతో బలిముఖాది దానవు లరుదెంచుచున్నారు. దేవత లాకవంక నిమ్మకు నీరువోసినట్లున్నారు.

వి. దు:—అదియే శ్రీవిష్ణు మాయావిలాసము.

వి. రి:—(స్వగతము) ఏవిలాసమైనను గానిమ్మ మగువలను సయితము మరులుకొల్పంజాలు నీకులుకులాడిమ్రోల నానాథుని నిలువ నియ్యంజనదు. (ప్రకాశము) ఈ సందర్శనంబువలన నాకు మిక్కిలి శ్రమగలిగినది. ఇఁక మననిలయంబుల కఱిగి విశ్రమింతమురమ్మ.

వి. దు:—ప్రేయసీ! ఇపుడు ప్రవర్తిల్లఁబోవునది దర్శనీయము.

వి. రి:—అదిగో! అప్పుడే యాబిత్తరిం జూచి నీ చిత్తంబు స్మరాయత్తంబైనది. ఇఁకనిట నిన్నుంచరాదు. (అని వాని కన్నులుమూయ నిరువురు నిష్క్రమింతురు.)

## చతుర్థాంకము—ప్రథమరంగము.

(అంత యథానిర్దిష్టయై మోహిని యమృత కలశంబుఁగొని బలి మొదలగు దానవులును, మఱి యొకవంక దేవతలును ప్రవేశింతురు.)

బలి:—సుందరీ! సుందరి! పరిపూర్ణ రాకాసుధాకర బింబంబున కెన యగు నీముద్దుమో మొకసారి దర్శింపనిమ్మ, యీ వైపునకు మఱలుము.

మోహి:—(మఱలిచూచి) దానవేశ్వరా! ఈ ముజ్జగంబులం గలవారెల్లరు నీ కటాక్ష వీక్షణంబులం గోరుచుండ నాబోటి బోటులు నీయందు దయ యుంచుటా? ఎంతమాట!

బలి:—(తనలో) ఈ కుసుమకోమలి యెవ్వతెయొ! నాయెడ ననురాగోత్కంఠితంబులగు వీక్షణంబులం బఱగించుచు నా పలుకులకు వినయపూర్వకముగా నుత్తరం బిచ్చుచున్నది. ఇఁక నా సరసంపు భాషణంబులచే దీనిఁ బ్రసన్నురాలిం జేసుకొనియెద. (ప్రకాశముగా) బాలికామణీ! దానికేమి, నీ వెవ్వరిదానవు, ఎచ్చటనుండి యెచ్చోటికి కరుగుచుంటివి?

మోహి:- తే-గీ. దానవేశ్వర! యెవ్వరి ♦ దానఁగాను
బరుల యాజ్ఞలలోఁబడి ♦ వరలఁబోను
యిచ్చవచ్చిన చోటుల ♦ కేగుచుందు
మనసు మెచ్చెడితావుల ♦ మసలియుందు

బలి:—నితంబినీ! నీవొకరి యాజ్ఞలలో నుండ నక్కరలేదు. యీ దేవదానవులెల్లరు నీకనుసన్నల మెలంగునట్లొనర్చెద. ఏనుభవదీయ కింకరుఁడనై నీచెప్పినటుల నడచుకొనుచుండి యెల్లపుడు నీకుఁ బ్రియంబుగూర్తు. నాతావున నుందువా?

మోహి:—(మందహాసముతో) ఔరా! ఎంత చతురుఁడవు. నావంటి ముగుదల నిట్టి మాయమాటలలో బఱచుకొనుట నీకుఁ గరతలామల

కంబువలె నున్నది. లోకమున నెవ్వరైన భయభక్తులంగలిగి తన యాజ్ఞావశవర్తినియై మెలఁగు నిల్లాలిని గోరుదురుగాని, ధనము నకుఁబోయి గంగమ్మను దెచ్చుకొనునటుల నావంటి స్వతంత్రురాలింగోరి సేవసేయుచుండ నాశింతురా?

బలి:—మోహనాంగీ! నీవంటి రసికురాలి సేవయేగదా సరసుండగువానికి ముదావహంబు.

తే-గీ. చతురవతిగాని సతిపొందు ♦ సలుపుకంటె
ప్రౌఢతోడఁత సరస సం ♦ భాషణములె
సరసుఁడగువాని కెంతయుఁ ♦ సంతసంబు
గలుగఁజేసెడి ననుపల్కు ♦ పలుకువినవె!

మోహి:—అవు నది సత్యమేగాని మీవంటివారలు చతుర భాషణంబులచే ముగుదల వంచించి తమ యక్కరలు దీర్చుకొని తుదకు వారి నగడు చేయుదురు. అబలలవలకుఁ బోనేల యిప్పుడీ వేల్పులగతు లెట్లున్నవి?

బలి:—(తనలో) ఓహో! ఈయెడ మే మొనర్చిన సుధాకలశాపహరణంబు నధిక్షేపించుచున్న దీయేలనాగ! అవును, నవనీత మృదుల హృదయలగు పూఁబోఁడు లిట్టి దౌర్జన్యంబులంజూచి యేవగింతురు. ఈ సుధాధర కరుణారసము నాపైఁ బ్రవహింప నిఁక నాకీ యమృతమేల? ఇపుడీ యమృతమును వేల్పులకును మాకును బంచియిచ్చు భారం బీ మించుబోడియందుంచి నేదీని స్నేహంబువడసెద. (ప్రకాశముగా) ఇందుముఖీ! ఈయెడ నీవు నన్నన్యథా భావింపవలదు.

తే-గీ. సాగరంబును మథియింప ♦ జననమొందె
అమృత కలశంబు, మాకు నీ ♦ యమరులకును

సమముగాఁ బంచియొసంగంగఁ ♦ జాలునట్టి
నేర్పరులఁ గాన నియ్యెడ ♦ నీవు దక్క.

కావున నీవు మాకెల్లరకుం బెద్దవై యన్నదమ్ములమగు మాదేవదానవుల కీసుధ సమముగాఁ బంచిపెట్టుము. (అని సుధాకలశమును మోహిని చేతి కొసంగఁబోవుచు వారించి) చక్రవర్తినీ! నీ కుచకలశము నాచేతి కొసంగి నీ యమృతకలశము నీవు గైకొనుము.

మోహి:—(తొలఁగి చని) అమ్మ చెల్లి! లోకముల నందఱు నావలె మాయా మర్మము లెఱుంగని నిర్మల హృదయులని తలంచి కొంచెము మనసిచ్చి మాటలాడినందుల కీరీతి వరుస వావులుజూడక యిందఱిలో నిటుల పరిహసింతువా?

బలి:—సుందరీ! వరుస వావులు పొందికగా లేకున్నచో మనసు లొక్కటి కానేరవు. మనసునకు వచ్చిన వనిత మఱదలు గావలయును. కాన చిన్నదానా, నీవు నామఱదలవయ్యెదవు.

మోహి:—(చిరునగవుతో) పరిశేషన్యాయమున నీవునాకుబావవయ్యెదవా?

బలి:—(నవ్వుచు) నీదయ యున్నచో నటులే.

మోహి:—(అనురాగమును బ్రకటించుచు) రసికవరా! అటులేకానిమ్ము. ఇంతలేసి గొప్పవారలు మీరలీసుధను సమముగాఁ బంచికొనఁజాలక నల్లని వన్నియు నీళ్ళును తెల్లని వన్నియుఁ బాలని దలంచు ముగుదనగు నేను మీకుఁ బంచియిచ్చు దాననా! నా శాసనము రీతి మీరు నడుచుకొనువారలా? ఏమో నే నమ్మఁజాల.

బలి:—ఏమీ! మేము నీ శాసనము నిరాకరింతుమా?

కం. తరుణీ నీదగు నాజ్ఞల
హరియు హరుఁడు బ్రహ్మ మొదలు ♦ నఖిలజగంబుల్
శిరసావహింతు రీయెడ
కరుణామతి నాదుకోర్కెఁ ♦ గావింపు మొగిన్.

(అని సుధాకలశము మోహినిచేత నుంచును.)

మోహి:—(కైకొని) దితిజేంద్రా!,

తే-గీ. ఇంతవాఁడవు నీవు న ♦ న్నిందుకొఱకు
కూర్మి బతిమాలఁగా గాదు ♦ గూడదనుచు
ద్రోసిపుచ్చఁగఁ జాల దే ♦ వాసురులకుఁ
దగినరీతిని సుధనిత్తు ♦ ధర్మగతిని.

బలి:—ఆలాగే యొసఁగుము.

మోహి:—అసురనాథా! అటు జూడు మాబృందారకులెల్లను సుధాపానమునకై త్వరపడుచున్నారు! ముందు కొంచె మమృతము నొసంగి వారి యలజడి మాన్పి యవ్వల సావకాశముగ మన దానవుల కొసఁగిన మేలని తోఁచుచున్నది. ఇది నీకిష్టమేనా?

బలి:—లతాంగీ! నీకెటు లొనర్చిన శ్రమ కలుఁగకుండునో యట్లు గావింపుము.

మోహి:—సరియే, వేల్పులారా! మీరెల్ల నీవంకకువచ్చి తూర్పు ముఖములుగా బంతులుదీరి కూర్చుండుఁడు. దానవులారా, మీరు పశ్చిమాభిముఖులరై యాసీనులరుగండు. (దేవదానవులటులొనర్తురు.)

మోహి:—(సుధాకలశమును గైకొని దేవదానవుల మధ్య నిలుచును.)

బలి:—(అనురాగముతో)

తే-గీ. జారుకుచ్చెల నొకచేతఁ ♦ జక్కఁబట్టి
అమృతకలశంబు నొకకేల ♦ నంది మాకు
వేల్పులకుమధ్య నిలచు నీ ♦ విధముఁ జూడ
పడఁతి! గనుపట్టెదవు గొల్ల ♦ భామ పగిది.

మోహి:—(నవ్వుచు) అవునది సహజమేకదా!

తే-గీ. దనుజనాయక! యింతటి ♦ ఘనుఁడవీవె
పాలకడలిని నేరుపు ♦ బలముమెఱయఁ
దఱచి గొల్లడవై మున్నె ♦ దనరుచూడ
నింక నే గొల్లభామనా ♦ చేసి వింత?

బలి:—సంజువాణీ! నీ చమత్కార వచనంబుల కెంతయు సంతసించితి. ఇఁక జాగుసేయక యసురుల బంతికి నమృతంబుఁ బంచియిచ్చి సత్కారంబ మనదానవుల కొసంగగమ్మ.

మోహి:—అటులే యొనర్చెద: (అమృతమును దేవతల కొసంగుచుండును.)

దానవులు:—అమ్మయ్యో! అమృతమంతయు వేల్పులే త్రాగుచున్నారు (బిగ్గరగా) సుందరీ! సుందరీ! ఆసుధనంతయు నమరులకే పోయుచున్నావా! మాపని యేమిచేసెదవు?

మోహి:—(స్వగతము) వీరకుఁ జేయఁబోవునది చక్రప్రయోగమే (ప్రకాశముగా) దితిజేంద్రా! చూడు మీరక్కసులు నన్నేరీతిఁ ద్వర పెట్టుచున్నారో! ఇఁకఁగొంచెమునే పోపికఁజేసియుండు మనుము నీవేల్పుల సమాధానపఱచిన మీబంతికి సావకాశంబుగ నమృతం బొసఁగవచ్చును.

బలి:—దానవులారా! యెందుల కీగందరగోళము? సద్దుసేయకుండుఁడు; (మోహినితో) కోమలీ! యీ సుధాకలశంబుఁగొని వేల్పులబంతి వెంబడిఁ దిఱిగి యమృతం బొసంగుటచే చాల యలసినట్లున్నావు.

సీ. శ్రోణీభరంబుచే ♦ సుదతి! నీ లేగౌను
అల్లనల్లన నసీ ♦ యాడుచుండె
గమనశ్రమంబుచే ♦ కలహంసయాన! నీ
పదపద్మములు తడఁ ♦ బడుచునుండె

చంద్రబింబము నేల ♦ జాలు నెమ్మోమున
 శ్రమ జలకణములు ♦ జారుచుండె
అమృత భాండము చేత ♦ సమరు భారంబున
 సుదతి! నీమోముగందె ♦ సొలయుచుండె

తే-గీ. వేడియూర్పుల నధరంబు ♦ వాడెమిగుల
 జడనుముడిచిన విరిసరుల్ ♦ జారుచుండె
 చక్కజేసెద నాపైని ♦ శాల్వతోడఁ
 చెమట తడిఁగ్రమ్మె విసరెద ♦ చంద్రవదన.

(అని తనపైశాలుతో మోహిని చెమటఁ దుడిచి విసరఁబోవును.)

మోహి:—(తొలఁగి దూరముగా నిలచి) ఔరా! ఇదియేమి గడుసుదనము! మాట మాటలవగుస నేదియో సందర్భముఁ గలిగించుకొని నా వంటి ముగుదల నిందటిలో నీరీతి ముట్టవత్తువా? సిగ్గు! సిగ్గు! నన్నంటరాకుము.

బలి:—(స్వగతము) ఈ స్త్రీడావతి నన్నిందటిలో నీరీతి ముట్టవచ్చునాయను మాటలో యెవ్వరులేక యేకాంతమునఁ దనయొద్ద చేరవచ్చునన్న భావము సూచించుచున్నది. కాంతల కెంత యనురాగ మున్నను సహజములగు లజ్జా భయములచే బురుషులకుఁ దమభావంబు తెలుక పడనీయరు. అట్టియెడఁ బురుషుఁడు సరసుండైన వారి యాశయంబు లెఱింగి ధన్యుండగును. (ప్రకాశముగా) రమణీమణీ! సయిస్టము. అటులే దూరముగానుండును, సిగ్గునొందకుము. శీఘ్రముగా సురల బంతికి నమృతమొసంగి యీవైపునకు రమ్ము.

మోహి:—ఆలాగే, బృందారకులారా! వేగిరముగా ద్రావుఁడు. నా కాలస్యం బగుచున్నది.

దానవులు:—మోహినీ! అమృత మంతయుఁ గొసరి కొసరి వారలకే పోసె దవు ప్రొద్దుపోవుచున్నది. యీ వంకకుఁ ద్వాగ గారావేమి?

మోహి:—(స్వగతము) ప్రొద్దుపోవుటయే గాదు మీ యదృష్టములుకూడా తిరిగిపోవుచున్నవి. (ప్రకాశముగా) దానవేంద్రా! నీ దానవులకు సమాధానము చెప్పుటకు నాకు శక్యముగాకున్నది. వేఱెవరైన మీకు నేర్పుగా బంచియిచ్చువారున్నఁ బిలమకొనుఁడు. (అని సుధాకలశమును బలిచేతి కొసంగఁబోవును.)

బలి:—దానవులారా! ఆకోమలాంగి నీరీతి నింకొకసారి క్రొత్తపెట్టితిరేని మిమ్ముల శిక్షింతును. (మోహినితో)

చం. అలుగకుమోలతాంగి!కను ♦ గాతిశయంబున దేవదానవా
వళి కమృతంబు నేరుపున ♦ బంచియొసంగఁగ జాలునట్టి లెం
దులగల రింకఁజూడు మిదె ♦ దోయిలి యొగ్గుచు వేచుకొందునో
జలజదళాక్షి! నామనవి ♦ చయ్యన గైకొని సూన్మఁజూపవే.

విలాసినీ! వారలతోనేమి నీయిచ్చవచ్చినట్టులే యుండు వేల్పుల కొసంగి మాబంతికి రమ్ము.

మోహి:—(ప్రసన్నయై) అటులే యొసఁగెద. (ఇంద్రునితో) దేవేంద్రా! తలవంచి యూరకుందువేల, అమృతంబుఁ ద్రావ సిగ్గిలుచుందువా? మఱియొకదోయిలి పట్టుము సూర్యచంద్రులారా? మోమోటపడకుఁడు చాలినంతసుధఁ గ్రోలుఁడు. దానవుల వైపునకు సత్వరం బరుగవలయు.

ఒకదానవుఁడు:—(రహస్యముగా) మిత్రమా! ఇది యొకనో మనకమృత మొసంగక వంచించి యంతయు దేవతల కొసఁగవచ్చిన మోసగత్తెవలె నున్నది. నీ వేమిగా భావింతువు?

2. దాన:—మిత్రమా! నేను నటులే యూహించుచున్నాను. మొదటి

నుండియు దీనిమాటలు నాకనుమానాస్పదములుగ నేయుచున్నవి.

1. దాన:—చూడు మావేల్పులకె ట్లమృతంబుఁ గొసరికొసరి పోయుచున్నది.

2. దాన:—ఏమిసేయుదు నీబాలిక క్రొత్త మనలనోరెత్తనీయదుగదా!

1. దాన:—అవు నీమైపోవని యీటక్కులాడి యిచ్చి కామవశుఁడై దాని మాయలెఱుంగక యున్నవాఁడు తక్కినరక్కసులును నోళ్ళు తెఱచుకొని దానివిలాసములం జూచుచున్నారు. ఇఁక నేనును గూడ నిటులేయుంటి నేని యీయమృతమంతయు నమరుల పాలగును గాన జాగుసేయక కామరూపుఁడనై వేల్పుల బంతింజేరి సుధాపాన మొనర్తు.

2. దాన:—మిత్రమా! నీయూహబాగుగనున్నది. (అట్లేయొనరించును.)

(మోహిని యాదానవుని కమృత మొసంగును.)

సూర్యచంద్రులు:—(మోహినికి సైఁగఁ జేయుదురు.

మోహి:—అహో పొరపడితినిగదా! (అనిచక్రమును విడచియదృశ్య యగును)

(తక్కినదానవులు నిశ్చేష్టులై చూచుచుందురు)

(అమృతపానమాచరించిన యాదానవుని మొండెము క్రిందఁబడెను)

(శిరంబంతరిక్షంబున నిలచును)

రాహువు:—(ఆక్రోశించుచు) నారాయణా! మీకు మే మేమియపకార మొనర్చితిమి. వేల్పులతోబాటు మేమును గష్టపడిన నేగదా యీయమృతం బిందువొడమె, అట్టిమొడ నమ్ముత్త్వవంచించి యీసుధ నంతయు వారి తేయుల కొసంగితివి. అదిగని మేమించుక సుధాపానమాచరింపఁ బ్రయత్నింప నాశిరం బీరీతి నీసుదర్శనంబుచే నుత్తరింప న్యాయమా? దుష్టదానవ సంహారణంబొనరింప నీవు కంకణంబుఁ గట్టుకొంటివిగాని మావంటి నిరపరాధుల సమయింపుటకుగాదె మహానుభావుండవగు నీకు మేమేమియుఁ జేసితిమి.

రముఁజేయ సమరులముగాము (సూర్యచంద్రుల సమీపించి)
ఓరీ! దుర్మదాంధులారా! మాకీ యవస్థగలుగుటకుమీరలే కారకులుగాని నారాయణుండు గాఁడు గాన మిమ్మీక్షణంబున నాదు క్రోధానలంబునకు శలభంబులఁ గావింతును.

శా. ఓరీ! కల్మషచిత్తులారా సుధ ♦ మే మొక్కింతగ్రోలంగ మీ
రీరీతి న్గని సైఁపలేక హరిచే ♦ హింసింపఁగాఁ జేతురే
రారండిప్పుడు మిమ్మునిర్వురను ఘో♦రంబైతగన్ బన్నగా
కారంబు న్గొని చిట్టలంచెదను వీ ♦ క న్వారిన స్వీడకన్.

(సూర్యచంద్రులపైఁ బడఁబోవును.)

సూ-చం:—భయంబున వడఁకుచు) నారాయణా! కాపాడుము కాపాడుము.

విష్ణు:—(ప్రవేశించి) సూర్యచంద్రులారా! రక్షించితిని భయ మొందకుఁడు. ఏలనీవీరీతి సూర్యచంద్రులపై మత్సరించెదవు. మహా తపస్సంపన్నులగు సద్దేవతలు దక్కయన్యు లీ పియూషపాన మాచరింప నర్హులు గారు. ఇపుడు నీదేహంబు నశించియు నమృతపాన మహాత్మ్యంబున నమరత్వంబు సిద్ధించినది. ఇదిమొదలు నీశిరంబు రాహువనియు మొండెము కేతువను నామంబుల నవగ్రహములలోఁజేరి యెల్లరిచేఁ బూజలందు చుండుఁడు. ఇదినాయాజ్ఞ.

రా-కే:—దేవా! నీయాజ్ఞ శిరసావహించితిమిగాని నిష్కారణముగా మా యందు వైరమూనిన యీ దివాకర నిశాకరుల కేదైన ప్రతీకార మొనర్పకున్నచో మాచిత్తములకు శాంతికుదుర దెట్లు?

విష్ణు:—(యోచించి) కొన్ని పర్వదినంబులయందు మీరు వీరి నించుక బాధించుచు ముఖల విడచిపోయెదరుగాక.

రా-కే:—(సంతోషములో) ఆహాహా!

భుజంగప్రయాతము.

పగ ల్చిత్రమందూని ♦ పర్వంబులందున్
వగ ల్జెందఁగ స్వీరి ♦ బాధించునాజ్ఞన్
దగన్నాకొసంగ న్స్మ ♦ దంబయ్యెగానన్
పగల్గీర నన్దన్సు ♦ బాధిన్తు మెప్పున్.

ఇఁక మాపదవుల కేగుచున్నారము.

రా-కే:—(నిష్క్రమింతురు.)

సూ-చం:—దేవా? మహానుభావా! ఇదియేమి ములుదీసి కొఱ్ఱడచినటుల నివుడుగల్గిన యీముప్పుడిషి కలిగినంతకాలము వీరిచే బాధ నొందవిధించితిరా? ఈదురాత్ములచే బాధనొందమాతరమా!

విష్ణు:—సూర్యచంద్రులారా! చింతింపకుఁడు. ఇది యిటులే జరుగవలసి యున్నది. ఆవిధముగా రాహుకేతువులచే నాక్రమింపఁబడి మీరు బాధనొందువేళ.

తే-గీ. పుణ్యవంతులు నైదగు ♦ పురుషవరులు
తర్పణంబులు జపములు ♦ తఱుచు జేయ
దానవులచేతఁ గల్గు సం ♦ తాప మెడలి
మఱల నెప్పటి సుఖముల ♦ వఱలఁగలరు.

మఱియు నట్టిగ్రహణకాలంబునఁ బుణ్యనదీస్నానమాచరించి మీకు బాధానివారణార్థము గాయత్రిం జపియించి శక్తికొలంది వేదవిదు లగు విప్రులకు నెద్దియేని దానములొసంగు ధీమంతు లంత్యకాలం బున మదీయ సాన్నిధ్యమందుదురుగాక.

సూ-చ:—ధన్యోస్మి. ధన్యోస్మి. మేమనుజ్ఞఁ గొనియెదము నమస్కరించి నిష్క్రమింతురు.)

విష్ణు:—దేవేంద్రా! మదీయంబగు సుందరీ రూపసందర్శనంబున డెందంబుల మరులుదయించి మైమఱచియున్న దానవులకు మరలఁ దెల్విగల్గ నా కపటకృత్యం బెఱింగి సమరసన్నద్ధులగుచున్నారు. ఇఁక వీరినందఱ రణంబున నిర్జించి విజయలక్ష్మిం గైకొందువుగాక.

ఇంద్రుడు:—ఇందిరావరా! మీకటాక్షము నాయందుండ నిఁక నాకు వీరిజయించుటేపాటి— (అందఱు నిష్క్రమింతురు.)



## చతుర్థాంకము—ద్వితీయరంగము.

(ప్రదేశము యుద్ధరంగమున బయలు. అంత దీర్ఘదన్తుఁడను నొక దానవుఁడు ప్రవేశించును.)

దీర్ఘ:—(నిట్టూర్పువుచ్చి) కటకటా! మారాక్షసుల వైభవంబులు నీటిమీఁది బుగ్గలవలె క్షణభంగురములగుచున్నవి గదా. ఈబలిచక్రవర్తి తానేమో శాశ్వతముగా రాజ్యమేలువానివలె నెచ్చటెచ్చటనో యడవులలోఁబడి యగుపడిన జంతువులనెల్లఁ బట్టికొని తినుచు సుఖముగాఁ గాలంబుగడపుకొనుచు మమ్మందఱ రప్పించి తన సైన్యములలోఁ జేర్చి కుతంత్ర కుశలులగు నాపాడుదేవతలపైకిఁ బురికొల్పె "యథారాజా తథాప్రజా" యనునట్లు మాతెలివిమాత్రమేమి వెలింగినది. యెంద్రకాయలుక్రొవ్వి బొరియలనుండక వెలువడినటుల మిట్టిపడుచు నాయమరులతోఁ బోరుసల్పితిమి క్షణములో మాదానవసైన్యమంతయు నశించినది. అబ్బబ్బా; తలఁచుకొనిన గుండెలదరుచున్నవి. దేవశేనాని యగు కుమారుని యొక్కయు దేవేంద్రుని యొక్కయు మఱియుఁ గల వేల్పుల యొక్కయు రణసంరంభమున నటనిలువ ధైర్యముచాలక ప్రాణములు తీపియగుటచే "బ్రతుకుజీవుఁడా" యని నాకాలికి బుద్ధిచెప్పి

యిటకుఁ బరుగువారిలిని మఱియు, కొందఱు నామార్గమే యనుస రించుచున్నారు. అయ్యో! మాసహోదరాజు నాదురాత్మగ్రుల దేవత లేమి తిప్పలుపెట్టుచున్నాఁరోగదా? మాప్రభువావలించినఁ జిటికలు వేయు నీదిక్కుమాలిన దేవేంద్రునకీచావు తెలివి నేఁడెందుం డివచ్చినది. చెపుమా (యోచించి) యిది వానిశక్తిగాదు. మాయా వియగు నావాసుదేవుని దుర్మంత్రమువలన నిట్లైనది. ఆదురాత్మునిం దలఁచినతోడనే నా యఱకాలిమంట నెత్తి కెక్కి వాని నీక్షణమే తుదముట్టింప వలయునన్న క్రోధము గల్గినది కాని వానిజాడ నాకిప్పు డెవరెఱింగింతురు. (ముందు జూచి) అదుగో? నాస్నేహితుఁడు జంబుకుఁ డిటువచ్చుచున్నాఁడు వానికేమైనఁ దెలియునేమో కనుగొనియెదఁగాక (అంత జంబు కుఁడు ప్రవేశించును.)

దీర్ఘ:—ఓరీ! జంబుకా! కుశలముగా వచ్చితివటరా మనదానవసైన్యాధి పతు లందఱు హతశేషులగు రాక్షసులతోఁగూడి సమరము విడచి పరుగెత్తుచుండ దేవసేనలు వారిం బోనీక తఱుము చుండనే యిప్పు డేమైనది.

జంబు:—యేమి యగును మనకు దురదృష్టదేవత ప్రసన్నయైనది.

దీర్ఘ:—అనఁగా నాకర్థముకాలేదు. మనదానవవీరు లేమిచేయుచున్నారు.

జంబు:—మృత్యుదేవత యొడిలో సుఖించుచున్నారు.

దీర్ఘ:—ఓరి? పందలారా! యిపుడేమి నిదురరా? మన నముచి బంభులు పులోముఁడుమున్నగు దైత్యసేనాపతులు వారలమందలించి దేవత లపైకిఁ బురికొల్పలేదా!

జంబు:—లేదు ముందే వారు రంభాసంభోగ మభిలషించి నాకంబునకేగిరి.

దీర్ఘ:—ఓరీ! స్వామిద్రోహులారా? మిమ్మెపు డేమిచేసినను పాపము లేదురా జంబుకా! ఇపుడు మనమహారాజైన నావిశ్వాసఘాత

కుల, దండించి వేల్పుల జయింపఁ బూనవలదా.

జంబు:—ఆయుష్మంతుఁడగు బలిచక్రవర్తి కట్టియవకాశములేదు.

దీర్ఘ:—ఆవైరోచని యిపు డెచట నేమిచేయుచున్నాఁడు.

జంబు:—చెప్పెద విను మాయన కిపుడు జ్యేష్టాదేవి ప్రత్యక్షమై తనమహిమలఁ జూపుచుండుటచే నితరములు మఱచియున్నారు.

దీర్ఘ:—జ్యేష్టాదేవి యనఁగా నెవరు.

జంబు:—అనఁగాఁ బెద్దమ్మగారు.

దీర్ఘ:—(సంతోషముతో) యెంతసంతోష వార్తఁజెప్పితివి పెద్దమ్మగారు మన మహారాజునకుఁ బ్రత్యక్షమైరా? అటులైన మనలఁగూడ దనపుత్రులరీతిఁజూచి కాపాడుమని ప్రార్థింతమురమ్ము.

జంబు:—(నవ్వుచు) అక్కరలేదు. మాయందఱిమాట లెటులున్నను నిన్నుమాత్రమె తనపుత్రునిగాఁదలంచి యనుగ్రహించినది. లోకమంతయు నటులే చెప్పుకొనుచున్నారు.

దీర్ఘ:—(సగర్వముగా) ఏమని.

జంబు:—నీవు పెద్దమ్మ పుత్రుఁడవని.

దీర్ఘ:—ఏమిరా? పెద్దమ్మ పుత్రుఁడవని నన్ను నిందించుచున్నావా నీనాలుకచీల.

జంబు:—పెద్దమ్మ పుత్రుఁడవే కాకున్న మహావీరులగు నముచి జంభులు తక్కినదానవ సైన్యములు రణరంగంబున మడియుటయు మనప్రభుఁడు శత్రువులచేఁ బట్టువడి దుఃఖించుచుండ ప్రాణములు తీపిగాఁ దలంచి యిచట్టికివచ్చి కూరుచుండి పనికిమాలిన ప్రసంగములతోఁ గాలముఁ గడుపుచుందువా?

దీర్ఘ:—(ఆత్రముతో) ఏమిరా! ఇంతకుముందు మనదైత్య సేనాపతులందఱు స్వర్గమునకేగిరనియుఁ దక్కినదానవులు మృత్యుదేవతయొడిలో ని

దురించుచున్నారనియు దైత్యేంద్రునకు జేష్టాదేవి ప్రసన్నురాయెన దనియుఁ జెప్పితివే మఱల నింతలో నిట్లుపలుకుచున్నావేమి?

జంబు:—ఏడ్చినట్లేయున్నది నీతెలివి. జ్యేష్టాదేవి ప్రసన్నురాయెనదనఁగా దరిద్రము నెత్తికెక్కినదనియు మృత్యుదేవతయొడిలో నిదురించుచున్నారన్నను రంభాసంభోగార్థము స్వర్గమునకుఁ బోయిరన్నను సమరమునఁ జచ్చినారని యర్థము. ఇప్పటికైనఁ దెలిసినదా!

దీర్ఘ:—అయ్యయ్యో! ఎంతలో నెంతటిచేటు మూడినదిరా యిఁక మనల మాత్ర మావేల్పులు బ్రతుకనిత్తురా?

జంబు:—ఒకవేళ పొరపాటున దేవతలు విడచినను విష్ణుని చక్రము మాత్రము మనల విడువదు.

దీర్ఘ:—(రోషముతో) వాఁడేమిచేయఁగలఁడు. ఇదివఱ కేదానవవీరునైనను మోసముచేఁ జంపెనేగాని యెదుటఁబడి న్యాయముగా యుద్ధమొనర్చి సంహరించెనా మనబోటి శూరుల యెదుటికివచ్చి సమర మొనర్చుటకు వానికిఁ జాలభయము గాన నేనిపుడు వాని యెదటి కేగి నామగఁటిమి మెఱయ యుద్ధమొనర్చి వానిఁ జంపి మన దానవేశునికి జయంబుఁగూర్చెద నీవు నావెంటవత్తువా?

జంబు:—ఎచటికి.

దీర్ఘ:—ఇపుడువాఁ డెచటనుండును.

జంబు:—వైకుంఠమున

దీర్ఘ:—(బింకముతో) అచటికే పోయెద.

జంబు:—ఇపుడు దేవతలలో నెవరికంటఁ బడినను నిన్నును నన్నును వైకుంఠమునకు వారలే పంపుదురు.

దీర్ఘ:—ఛీ! వారలు నాకు సాయమేల నేనేపోయి వానిఁ బరిమార్చెదనని సంరంభముతోఁ బోవుచున్నాఁడు. (తెరలో)

ఓస్వర్గమర్త్య పాతాళవాసులగు సురాసుర మనుజ గరుడ గంధర్వ

కిన్నర కింపురుష సిద్ధసాధ్య చారణ యక్ష గుహ్యక పన్నగ నిఖిల స్థావరజంగమంబులారా! సావధానులరై వినుండు. మున్ను దూర్వాసు శాపంబుచే వినష్టంబగు విభవలక్ష్మి యంతయు శ్రీరమారమణుని కరుణాకటాక్షముచేఁ బడసి బలిముఖాది దానవ సమూహంబుల నిర్జించి దేవేంద్రుఁడిప్పుడు సకలఁ త్రిలోకాధిపత్యంబుఁగొని చింతామణీ భద్రసింహాసనంబునఁ గొలువున్నవాఁడు. ఇఁకమీరెల్లరు దుష్ట దానవుల వలని భయంబుఁబాసి సుఖులరైయుందురుగాక.

దీర్ఘ:—(వెనుకకుఁబడి) అయ్యో! చచ్చితి చచ్చితి మాయావేషముఁబూని నారాయణుఁడు నన్ను జంపవచ్చుచున్నాఁడు. ఓ వాసుదేవా! నిన్ను నేను జంపఁదలఁచుకొనలేదు. నన్ను నీవు జంపవలదు మహానుభావా!

(తెరలో)

ఎవఁడురా! యిట్టి శుభసమయమున నల్లిలము లాడుచున్నవాఁడు.

దీర్ఘ:—మహానుభావా రాక్షసులముగాము. దేవతలము మీదాసులము కాపాడుము కాపాడుము. (తెరలో)

భీరులారా? పొండుమీదారిని.

దీర్ఘ:—నాయనా! మేమువచ్చి మీవాకిటఁ గుక్కలమై పుట్టి నీఋణముఁ దీర్చుకొందుము. (నిష్క్రమింతురు.)

—:0:—

## చతుర్థాంకము—తృతీయరంగము.

6 ప్రదేశము దేవేంద్రుని సభాస్థానము. ఇంద్రుఁడు శచియు బృహస్పతియు జయంతుఁడు దిక్పాలకులు నుపేంద్రుఁడు నప్సరసలు దక్కిన వేల్పులుచితాసనములనుందురు.

ఇంద్రు:—ఆహా! నేటికి శ్రీరమానాథుని కరుణాకటాక్షముచే నాకడగండ్ల కడతేర మరల సతీసుతులతోఁగూడి యీపగిది యభ్యుదయాను

నారదుండంగ్గలితి (విష్ణువునుగాంచి భక్తితో)

మ. అడగె న్శత్రుసమూహమెల్ల మదికత్యానందముగ్గలె నా
యుడుముల్లీరె సుధారసం బరుల కొక్కింతేనియు న్నేక మా
యెడనవ్యాజకృపామతిఁ సుఖయురాజ్యేంద్రంబుమా కెంతయుఁ
గడుభద్రంబును గూర్చు భక్తజన రక్షాశ్రీరమానాయకా.

ఇవే (నందనశతంబులు నమస్కరించును.)

విష్ణు:—దేవేంద్రా! నీయోరిమియే నీశత్రువుల నడంచి నీ కభ్యుదయము
నర్పించినది దీనికి నన్నింత ప్రశంసింప నేల?

బృహ:—భక్తజనచింతామణీ యెందులకుఁ గనుగన్నెదవు. ఇది దేవవిభుని
స్వశక్తియా.

తే_గీ. అతిబలంబును దపముచే ♦ నలరుచున్న
యసురనాథున కాజని ♦ యపజయంబు
నిర్జరాళికి దూరమున ♦ నిండు జయము
గల్గు టదియెడ నీకృప ♦ గాకయున్న.

ఈతండు రాజ్యంబుఁగోల్పడి యనుభవించిన కష్టంబులును; ఆవైరి
చనిచేనందిన యవమానములును, నీకటాక్షము లేకున్నఁ దీరునవియా!

విష్ణు:—దేవగురూ! ఇదినీ వెఱుంగనిదియా!

తే_గీ. ఆపదలె సాధుప్రులకు మ ♦ హాశుభముల
కాకరంబగు సుజనులా ♦ నట్టివారి
విజయములె దుఃఖహేతువై ♦ వెలయుచుండు
సజ్జనులనేఁచువారికి ♦ జయముగలదె.

జయ:—దేవా! జగన్నాథా! అంతయు భవత్కారుణ్య ప్రభావమే. ఇట్టి నిన్నేమని వినుతించు వారము.

ధృవకోకిల, నళినలోచననీమహాత్మ్యము♦నారదాదిమునీంద్రులే
తెలిసి ప్రస్తుతిఁ జేయఁజాలరు ♦ దేవదేవజగత్పతే
జలజసంభవ భర్గవందిత♦చారుశ్రీపద యుగ్మముం
దలఁచి సేవలొనర్పనిండుము♦దంబుగల్గె రమావరా.

శచి:—(అంజలిఘటించి) దేవా! భక్తవత్సలా! నేటికి నీకటాక్షంబుచే దాయలపంచఁజేరి దీనులమై వారికనుసన్నల మెలంగుచు సేవలొనర్చునట్టి కష్టంబులన్నియుఁ దీఱ శత్రువుల జయించి మఱల నెప్పటి విభవంబు లందఁగంటిమి. అట్టి నీకరుణారసంబు నిట్టిదని వర్ణింప మాబోటివారి కలవియగునే.

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీరమణ భక్తజన చిత్తసుమభృంగ జయ శ్రీమహిత దాస
జన సేవ్యా
నీరద శుభాంగ మహనీయగుణ భూషణవి నిర్మల సురూప
సురపక్షా
వారిజదళాక్షబుధవందితపదాంబురుహ వల్లవజ నాంబుజదినేశా
మారసుకుమార జయమంగళవిలాస హరి మాధవ ముకుంద
మణిహారా.

అనుగ్రహింతువేని నాదొకచిన్నివిన్నపముగలదు.

విష్ణు:—అమ్మా! మీవంటిసుజనుల కభీష్టంబులొసంగి రక్షించుటయే నాకుఁబరమ సంతోషము, అభ్యంతరమేమి తెల్పుము.

శచి:—భక్తవత్సలా! చిత్తగింపుము.

తే-గీ. అఖిలలోకంబులకు మాత ♦ యైనయట్టి
శ్రీరమాదేవి నినుఁగూడి ♦ చెలువమమర
కొమరుమీరంగ నా తోడి ♦ కోడలగుచు
గలసి మునుపోల్కి నిటనుండ ♦ వలయునెపుడు.

విష్ణు:—అమ్మా! ఆరమాదేవియు నిటులే ముచ్చట పడుచుండును. మీకిది వఱకే యీత్రివిష్టపరాజ్యలక్ష్మి ప్రసన్నయై యున్నది. అదిగో దేవి సాక్షాత్కరించినది (లక్ష్మిప్రవేశించును.)

(ఇంద్రాదులు లేచినిలతురు. విష్ణువులక్ష్మిని దనవక్షమునఁ జేర్చికొనును.)

ఇంద్రాదులు:—జయ రమానాథ జయ (అందఱునమస్కరింతురు.)

విష్ణు:—దేవీ! ఇప్పటికి నీకు నాయందనుగ్రహము కల్గినదా.

లక్ష్మి:—ప్రాణేశ్వరా! అనివార్యంబగు దూర్వాసుని శాపంబుచే నేనిమ్ముఁ బాసిపోవలసిన దానవైతిని, మన్నింపుఁడు.

విష్ణు:—దేవీ! భవత్సమాగమంబుచే నామనంబునకు మహానందంబుగల్గె.

చతుర్థాంకము—చతుర్థరంగము.



పంచమాంకము—ప్రథమరంగము.

—(0)—

(ప్రదేశము కైలాసము—ప్రవేశము నారదుఁడు.)

నార:—అ. హా. హా! శ్రీహరి కరుణాకటాక్షమున జిరకాలాపేక్షితంబైన సురాసుర సంగ్రామంబు సంఘటింపఁజేసి మితిలేని యానందాంబుధి నోలలాడఁగంటి కాని, యిక్కార్యంబున నాకలహనైపుణిఁ

గొనియాడఁ దగినది గాదు. ఆజన్మద్వేషులగు దేవదానవుల కిట్టిసంగరంబు లెన్నియో జరిగియున్నవి, సృష్ట్యాదినుండి యన్నియెడల నీరక్షీరంబులంబోలె నన్యోన్యసౌహార్దంబుచే నలరారు హరిహరుల కేపైన కలహ మొక్కటి సంఘట్టించితినేని యప్పుడు గదా నాచాతుర్య మీపదునాల్గు లోకంబులవారును బ్రశంసింతురు? అబ్బా! శివకేశవుల కేమి? నేనేమి? వైరము లేమి? సంఘటించు టేమి? (యోచించి) నేనుగాక మఱియెవ రీకార్యమునకు సమర్థులు. ఎట్టి దుర్ఘటకార్యమునైనను ధైర్యమూని విడువక యొనర్చినచో నయ్యది ఫలించునని బుద్ధిమంతు లందురు. ఎట్టులైన నీకార్యంబుపట్ల నా బుద్ధికుశలత వినియోగింపవలయు, ఉమేశ రమేశుల కెంత మైత్రి యున్నను మాధవుఁడు కడుమాయకాఁడనియుఁ దానుత్తమజ్ఞాన సంపన్నుఁడనియు మహాదేవుని మనంబున నుండుటఁ గనిపెట్టితిని. ఇఁక నేనాటఁదలఁచిన కలహవృక్షమున కీశంభుని యహంకారమే యంకురమగుంగాక! నేనద్దాని కనువగు దోహద మొనర్చి యనతి కాలంబున ఫలింపఁజేసెద; ఈ కారణంబున మహాదేవునకుంగల యహంకారము నిర్మూలింపఁజేసెద. ఇట్టి కార్యంబులపట్ల శ్రీహరి నాకుఁ దోడ్పడుచునే యుండును. భక్తజనావనా! శ్రీమన్నారాయణా! ఈ యెడ నాప్రయత్నము సఫలమౌనటు లొనర్పుము.

(గానమొనర్చుచు నిష్క్రమించును.)

(పార్వతీశంకరులు ప్రమథసమేతముగాఁ బ్రవేశింతురు.)

శంక:—గిరిరాజసుతా! ఈగిరికాననంబులు నిత్యఫలకిసలయ విలసితంబులై వేడుకం గడుశోభావహంబై యలరుచున్నవి. శుకపిక శారికాది శకుంత సన్తానంబు లొకచో గుమిగూడి సరససల్లాపంబులతో మధురంబులగు ఫలహారంబు లొనర్చుచు మిగులసంతసంబునఁ గాలక్షేపము సేయుచున్నవి కంటివే?

పార్వ:—ప్రాణేశ్వరా! ఈతీరున నే సుహృద్బంధుజనములంగూడి యానందించు దినమేకదా సుదినము! ఇప్పుడీ విహంగసముదాయ సమావేశంబుఁ గనినయప్పటినుండియు నామనంబున నొకకుతూహలము దయించినది.

శంక:—దేవీ! నీకోర్కెఁదెల్పు మవశ్యము నెఱవేర్చెద.

పార్వ:—నాథా!

ద్విపద. మనవారలౌ రమా ♦ మధుసూదనులను

గని వారుమనమును ♦ కడుసంతసమునఁ

గొన్నినాళ్ళొకచోటఁ ♦ గోర్కెలుమీఱఁ

బన్నుగా వసియింప ♦ భావంబుగలె.

శంక:—దేవీ! అటులే కానిమ్ము.

నందికేశ్వరుఁడు:—దేవా! సముద్రమథన వృత్తాంత మేమైనదియుఁ దెలియదయ్యె.

పార్వ:—దేవదేవుండగు శ్రీహరి యచటనుండెఁగదా! కార్యము శుభావహముగానే నెఱవేఱియుండును.

శంక:—శైలనందనీ! మీశౌరి యటనుండుటయు నాకార్యము తిన్నగా నెఱవేఱుటయుఁ గూడనా? సమయానుకూలమగు యుక్తులేవియో పన్ని యాకడలియందుఁ బొడమినవన్నియు వేల్పులకే కట్టబెట్టి వారికిని వీరికినిగలహముఁబెట్టి తుదకు దానవుల మట్టుపెట్టుటయే గదా యాతనిపని!

పార్వ:—సర్వసముఁడగు నామహానుభావునకు వేల్పులొకటియు రక్కసులొకటియునా? న్యాయ మేవంకనున్న నాతఁ డావంక నుండును.

శంక:—దేవీ! ఇట్టిమాటలకేమి? సముద్రమథన వృత్తాంతమున నారదుని

కార్యభారమంతయు మీయన్నగారే వహించి యిపుడు వారికింగల సఖ్యం బెడలించి యన్యోన్య వైరంబులు గలుగఁజేసి దానవులకంటు దుమ్ముగొట్టును.

(తెరలో గానధ్వని.)

పార్వ:—అదిగో! అనుకొనుచుండఁగనే నారదుండును వచ్చుచున్నాఁడు

నార:—(ప్రవేశించి) జయము, జయము మహాదేవశంభో!

క. వందనము పార్వతీవర
వందనము మహేశ లోక ♦ వందితచరణా
వందనము నాగభూషణ
వందన మఖిలేశ శర్వ ♦ వందన మభవా.

(నమస్కరించి పార్వతిని సమీపించి) అమ్మా! వందనములు.

శంక:—ఓహో! నారదా! యెచ్చటనుండి యిచ్చటి కరుదెంచితివి? లోకములకంతయుఁ గుశలమా?

నార:—(కూరుచుండి) దేవా! హాలాహల పానధురీణులగు మీరు సుఖముగా నుండ లోకములకుఁ గుశలముల కేమికొదువ?

శంక:—(సరగ్యముగా) దానికేమి నారదా! సముద్రమథన వృత్తాంతమేమి?

నార:—స్వామీ!

సీ. అవధారు దేవ! మీ ♦ రారీతివిషమును
భక్షించి లోకంబు ♦ రక్షజేసి
అరుదెంచినంతట ♦ నందునఁ జంద్రుండు,
ఐరావతము, వేల్పు ♦ హయము,కామ
గవియును, నప్సరో ♦ గణములు, కల్పక
తరు నికరంబు, చిం ♦ తామణియును

జనియింప నిర్జరే ♦ శ్వరుఁడు గైకొనె, వాని
క్రమతమున్నీటిలో ♦ గలయవల
కౌస్తుభం బుదయింప ♦ గైకొనె శ్రీహరి
యవ్వల ధన్వంత్రి ♦ యనఁగబఱగు.

తే-గీ. నాతఁ డమృతంపు కలశంబు ♦ నందివార్థి
యనువుమెఱయఁగ వెల్వడ ♦ దనుజులెల్ల
బలముఁజూపట్టి యాతనిఁ ♦ బట్టి వార
లమృతకలశంబుఁ గైకొని ♦ రమృతరూప.

పార్వ:—ఔరా! ఎంతదౌర్జన్యము.
శంక:—తరువాత సమరులేమి చేసిరి?
నారద:—

ఉ. ఆపగిది న్సుధ న్దితిజు ♦ లాదట బల్మినిగొన్న నిర్జరుల్
శ్రీపతిఁజేరి మమ్ముసర♦ సీరుహలోచన బ్రోవుమంచుఁ దా
మోపిక సన్నుతుల్సలుప ♦ నొయ్యన శ్రీశుఁడు లోకమోహినీ
రూపముదాల్చెఁ దన్ను నసురుల్గనిమోహమునన్మునుంగఁగన్.

శంక:—ఏమీ! విష్ణుండు కామినీరూపు ధరించెనా? తరువాత తరువాత.
నార:—తరువాత, నావరవర్ణిని సరసంపు భాషణంబుల సురాహితులవంచించి యమృతమంతయు బృందారకుల కొసంగె.
శంక:—అందులకు దానవులేమిచేసిరి?
నార:—చేయున దేమిగలదు?

క. ఒకఁడు బిగిగుబ్బల వే
ఱొకఁడు నునుకొప్పుతీఱు♦నొకఁడుహొయలు

న్నొక్కఁడు నెన్నడసొంపును
మక్కువఁ గన్గొంచునెల్ల ♦ మఱచిరి శర్వా.

శివు:—ఛీ! యెంతమూఢులు! మాయామోహినిన్వలచి యమృతంబుఁ గోలుపోయిరి.

వార:—కైలాసవాసా! వారినననేల? మనమైన నంతియే.

శివు:—ఏమీ! నేనుగూడ నంతియేనా! కొంకులేక పల్కెదవు.

వార:—దేవా! మీ రావిలాసినిం గాంచనివారుగాన యట్లనుచున్నారు.

సీ. పదివేలచంద్రబిం ♦ బములు గూడిననైన
సకియ నెమ్మోముకు ♦ సాటిరావు
వేవేలవిరిదమ్మి ♦ విరు లొక్కచోఁజేఱ
కలికి వాల్గన్నుల ♦ కెలువురాదు
కోటిహంసలుగూడి ♦ నీటుగా నడయాడ
మగువ నెన్నడనున్న ♦ సొగసుఁ గనవు
చిల్కపిండొక్కచోటఁ ♦ జేరి పల్కిననైన
బాల పల్కులసొంపుఁ ♦ బోల లేవు

తే-గీ. వెలయఁ బదునాల్గులోకము ♦ ల్వెదకిచూడ
సకియ కాల్గోటికెనయైన ♦ చాననెందుఁ
జూచియెఱుగము మఱిముందు ♦ జూడబోము
సరవివేయేండ్లు తపములు ♦ సల్పియైన

శివు:—ఆహా. హా! పురుషుఁడు స్త్రీనైపథ్యముఁ బూనుటయు దానిఁజూచుటకై మాబోటిఘనులు వేయేండ్లు తపముసేయుటయు నందున సాతఁడు నీలవర్ణుఁడు. అరరే యీజగన్మోహనరూప మెట్లుండునో గదా.

భృంగీశ్వరుఁడు;—గంటెభాగవతుల గరుడగంబమునొద్ద నిలచి హస్తాభిన యమునర్చుచు నాడుచుండఁగా స్త్రీపాత్రవలెనే యదియు నేత్రానంద దాయకమై యుండును.

నార:—తలయూఁచి పార్వతీవరా మీరిటులఁ దలంచెదరా వినుఁడు.

చ. బిసరుహపత్రలోచనను ♦ బ్రీతిఁగనుంగొనినంత మీర ల
త్కుసుమశరాస్త్రవేదనలఁ ♦ కుంగుజిత్తులై గిరిజా వధూమణిన్
మసలక మీనివాసమును ♦ మానసమందున నిచ్చగింపకన్
పసచెడి దానిగూడ మది ♦ భ్రాంతివహించి తపింతురెంతయున్.

వీరభద్రుఁడు:—(పండ్లుపటపటఁగొఱికి) అరే! ఏమంటివి.

క. ఓరీ నారద మాకపె
నారాయణుఁ డాఢ్యుఁడనుచు ♦ నయముదలిర్పన్
నోరికివచ్చిన యట్టులు
కారులుపేలంగఁబోకు ♦ కపటమునీంద్రా.

(నారదుని జన్నిదంబులఁబట్టిలాగును.)

శివు:—భద్రా! వీనితోనేమి శాంతింపుము (పార్వతితో)

క. తెలిగంటి వింటివే యా
జలజాక్షుని యాఁడురూపు ♦ చందముగని నే
నలరుల విల్తునిశరముల
గలగుదునంచని వచించెఁ ♦ గడు నిర్భయుఁడై.

లోకంబునంగల వారి వీరింబోలె నామోహ్య నారాయణుండేమో శీరంబుఁగలవాఁడని నోరికివచ్చినయట్లు కారులుపేలు నీనారదుని పరిహాస భాషణంబులవిని యూరకుండుట నాబోటి మేటిఘనునకుం బాడియె.

పార్వ:—నాథా! అయిన నిప్పు డేమి చేయఁదలఁచితిరి.

శివు:—నే నిప్పు డా కాంచనాంబరు కడకేగి యాతని మించు బోడిరూపంబుఁ గాంచి యించుకయైన మనంబున సంచలనంబుఁగాంచక యాహరి నోడించి జ్ఞానవైరాగ్యంబుల విరించి ప్రముఖులు ప్రశంసించునట్లు లోనర్చి యీనారదునకుఁ దలపంపులుఘటించి నాయశశ్చంద్రికల నీరేడుజగంబుల నించెద.

పార్వ:—ప్రాణవల్లభా! ఇదియేటిభ్రాంతి విశ్వరూపుండగు రమాకళత్రుని విలాసినీరూపంబుఁగాంచి మరులొందక నిబ్బరంబు వహించియుండ నెట్టివారలైనను సమర్థులగుదురా? అదియునుగాక మత్స్యకూర్మాద్యవతారంబు లనేకంబులుదాల్చి ప్రపంచంబు నుద్ధరించు నాభక్తవరదుని మాహాత్మ్యంబు తెలియఁగరే!

శివు:—పార్వతీ! అతఁడువిశ్వరూపుండని వినుతించుచుంటివేగాని విశ్వకర్తయు విశ్వభర్తయు విశ్వహర్తయు నగు నీమగని మహిమ దెలియఁగవుగదా! అన్నగారి మత్స్యకూర్మాద్యవతారంబులఁ బ్రశంసింతువేగాని మగఁడు లోకకంటకులగు త్రిపురులంజంపి జగంబుల నుద్ధరించునాఁడు పాపము నిదురించుచుంటివేమో?

పార్వ:—నాథా! త్రిపురసంహారంబొనర్చి లోకములఁ గాపాడిన మీమహిమ తెలియఁగని దానఁగాను. అయినను

తే-గీ. పురుషుఁడై హరిఁగన్గొని ♦ బుధులుగూడ
మానసంబులు చలియించి ♦ మఱులునొంద
నతివ రూపంబుఁదాల్చిన ♦ యతనిఁజూడ
నీమనంబున ధైర్యంబు ♦ నిలువఁ గలదె.

నార:—(సంతోషముతోఁదనలో) ఆహా! నేనాడింపఁదలఁచుకొనిన కలహనాటకమున కీపార్వతీశంకరులు నాందిప్రారంభించినారు. ఇఁక

నీనాటకమునందు శౌరిపాల్గొనకతప్పదు. ఇంకనేమి నాకుఁబండుగలపైఁబండుగలు విందులపైవిందులు.

శివు:—ఏమేమి! మానసాదులు నాయధీనములైయుండ ధైర్యము నిలుచునుగా.

పార్వ:—తే-గీ. మిగుల మృదువైనయట్టిది ♦ మీమనంబు
చాలనగఁ గాదు యోజింప ♦ శౌరికూడ
పూలవిల్తుని పగఁబట్టి ♦ పూనియేమ
ఘనులనో నవ్వులాటఁ జేయు ♦ గౌరవంబు.

శివు:—దేవీ! నామది మృదువైనదనియు శౌరి పగఁగాఁడనియు సంశయించు చుంటివా? అన్నియుఁ జూతువుగాని యిఁకమదనుఁడు నాపైఁబగఁబూనునని తలంకకుము. ఇదిగో! వానింజయించిన బిరుదుగండపెండెర మీయెదను గాలనున్నది.

పార్వ:—క. మదను జయించితి నంచని
సదమదముగఁ బల్కనేల । సర్వేశ్వర యా
మదనుఁడు మనసిజుఁడై నీ
మదిమోహము నింపలేదె । మహితవిచారా.

శివు:—క. బాలా యీచందంబున
నాలావు నెఱుంగ కిట్లు । నళినదళాక్షీ
జాల ఘనుఁడనిపల్కెదు
చాలు న్నాలింపుమింక । సరసిజగంధీ.

ఎన్నఁడో చచ్చినపగవానిపై స్తోత్రపాఠములు బాగుగా నేర్చికొంటివి.

పార్వ:—నాథా! శాంతించి దారుకావన వృత్తాంతము స్మరించుకొనుఁడు.

శివు:—(గద్దించుచు) ఆ! అధికప్రసంగములు గట్టిపెట్టుము మారునివారికి

లోనై మిమ్ముంబోలు సుందరులఁ బొందుచుంటినసుకొంటివా. అది లోకనటనకుమాత్రమే.

నార:—(స్వగతము)ఓహో! శ్రుతిమించి రాగమునకు వచ్చుచున్నదే రాని మ్మీశ్రీకంఠుని వైకుంఠమునకుఁబ యనమగునట్లొనర్చెద. (ప్రకాశము) ప్రమథాధిపా నేఁజెప్పఁబోవునదియు మఱికొంతగలదు.

శా. ఏదీచూతముగా దెనీమగటిమిన్ ♦ హెచ్చైనవైరాగ్యమున్
వాదుల్బానెడునీయహంకృతియు న ♦ వ్వామాక్షినీక్షించినన్
మోదంబున్ మదినొందిదానికరుణ ♦ న్బొందన్ మదిన్గోరి నే
నీదాసుండనటంచు మ్రొక్కెను భవా ♦ నీనాథ సత్యంబుగన్.

నంది:—(మండిపడి) అరే! జడదారీ? ఏమిపేలుచుంటివి.

పంచచామరము. జగంబుల స్సృజించి పెంచి ♦ చంపజాలునట్టిప
న్నగేంద్రభూషు ధిక్కరించి ♦ నావు నిన్నుబట్టి యీ
జగంబులెల్ల జూడ బుద్ధి ♦ చక్కఁజెప్పువాఁడ నీ
వగ స్త్వయన్ శమింపఁజేయు ♦ వారలున్నఁబిల్వుమీ.

శివు:—(వారించును.) [జడలుపట్టిలాగును.]

భృంగి:—(వికటహాసమొనర్చుచు) ఓయీ! నారదా! నీయిచ్చవచ్చినట్టుల నితరుల సంకీర్తనములకుఁ జెవులురిక్కపెట్టుకొని వినుట కిది వాసుదేవుని సభయని తలంచితివా యేమి? ఇఁకనిటనోరెత్తితివా నీజడలు జన్నిదములతోపాటు మాజడలకు జన్నిదములకు మొంతొళ్ళకుఁ జేటువచ్చును. అంతటఁగాని మాకోపము శాంతింపదు జాగ్రత.

వీర:—ఓరీమునీ! యిచట నీప్రతిష్టలుచూచువారెవ్వరునులేరు. మేమిటు

లొనర్చితిమని నీవాసుదేవునితోఁ జెప్పికొనుము లెమ్ము పొమ్ము (మెడఁబట్టిత్రోయఁబోవును.)

శివు:—భద్రా! వీనిపై నెందులకాగ్రహించెదవు. మనమిపుడే వైకుంఠమున కేగి యాహరి యాఁడురూపముఁ గాంచి మఱిలోందక నిబ్బరంబున నున్న యవ్వల నీతనిపనిఁబట్టుదము. ఇప్పటికూరకుండుఁడు.

పార్వ:—ప్రాణవల్లభా! ఈనారదునిమాటలువిని పూజనీయుండగు పురుషోత్తమునిపైఁ బద్ధుపూనఁదగునా.

ఉ. శ్రీరమణీవిభుండు సర । సీరుహనేత్రుఁడు దీనపాలుఁ డీ
నారదుప్రజ్ఞ నిల్పుటకు । నాతివలె గ్గనుపట్టునంత నీ
కోరిమి ధైర్యముం దొలఁగు ♦ నొయ్యనభ్రాంతిమనంబునిండు నీ
గౌరవమంతయుం దొలఁగుఁ ♦ గావుననూరకయుండుటొప్పగున్

శివు:—నీవెంతబోధించినను నేవినువాఁడనుగాను సత్వరంబిఁక వైకుంఠమునకుఁ బ్రయాణముగమ్ము.

నార:—ఉమాపతీ! ఇఁక నే సెలవుఁ గైకొందునా?

శివు:—అలాగే! కానిమ్ము.

నార:—అమ్మా సెలవిచ్చెదరా.

పార్వ:—మంచిది

నార:—(నిష్క్రమించును)

శివు:—ప్రమథులారా! ఇఁక మనము శీఘ్రమే వైకుంఠమున కరుగవలయు. అందులకుఁదగు సన్నాహములొనర్పుఁడు.

ప్రమథులు:—చిత్తము. (అందరునిష్క్రమింతురు)



## పంచమాంకము—ద్వితీయరంగము.

(ప్రదేశము. వైకుంఠమునందలి యుద్యానము శ్రీ. భూ. నీళాసమేతుఁడై నారాయణుఁడు ప్రవేశించును.)

విష్ణు.—ప్రాణప్రియురాలా! భక్తసమాగమమునకై యెన్ని ప్రయాసములొందర్చితి. తుదకుసముద్రంబుఁదఱచు తరికాండ్రలో నొక్కండనైతి కవ్వపుఁ గొండకుఁ గుదురుగా కూర్మంబనైతి. ఇఁక నెన్నియో శ్రమంబులకోర్చి యిప్పటికి నీయనుగ్రహమునొందిధన్యుఁడనైతి.

లక్ష్మి:—(నవ్వుచు) ఔనౌను! భక్తవత్సలులను మీబిరుదంబు నేనెఱుంగనా? పదచ్యుతుండగు విబుధపతి కడగండ్లకడతేర్పవలసి యింత శ్రమనొందితిరి లేకున్న మునిపాదతాడన వృత్తాంతము జరిగి యెన్నినాళ్ళయ్యెనో లెక్కింపుఁడు.

విష్ణు:—దేవీ నీవు నన్నుఁ బాసిపోయినది మొదలు కర్తవ్యతామూఢుండనై వెఱ్ఱివానివలె నీమూర్తిధ్యానంబుఁదక్క యితరములుమఱచి యుంటి. నామాట నమ్మకున్న నీభూసతినడుగుము.

భూదే:—దేవీ! ప్రాణేశునిపైఁ గినిసి నీవు కనుమొఱఁగినది మొదలు పెన్నిధిం గోల్పోయిన పేదకరణి చేష్టలుదక్కియున్న నాథునకు నేనెన్నివిధముల ధైర్యముఁ జెప్పినను కార్యములేదయ్యె. కడకు బ్రహ్మదిదేవప్రార్థితుఁడై సాగరంబుఁ దరువఁ దోడ్పడియె.

నీళ:—దేవీ! నిత్యానంద విలసితంబై యలరారు నీవైకుంఠము నీవులేనినాఁడు నిర్జనంబగు నరణ్యంబువలెఁ గన్పట్టినది.

భూదే:—దేవీ! పద్మవాసినీ! ఆజడదారి ముంగోపియనియుమనవిభుఁడుబ్రాహ్మణవిధేయుఁడనియుఁ దెలిసినదానవయ్యు నట్లలిగిపోవన్యాయమా?

లక్ష్మి:—సఖీ! దేనికైననోర్వవచ్చుగాని యన్యునిపాదతాడనంబోనర్చుటెట్లు?

నీళ:—దేవీ! హరిప్రియా! ఇఁకనెన్నటికట్లు మమ్ము విడచి పోవకుండుటకై

యిదె సహస్రకమలములతో నిన్నుం బూజింతుము. అనిగంగామైఁ బన్నాభిషేకముఁ జేయుదురు)

లక్ష్మి:—చెలియలారా! అందఱమును గలసి మనప్రాణేశుని బూజింపము

(అందఱు శ్రీహరిపైఁ బుష్పములఁ జల్లుదురు.)

లక్ష్మి:—ప్రాణవల్లభా! మునిపాద తాడనంబునఁ గలిగి మిమ్ముంబాసి యున్న నన్ను మన్నింపుఁడు. ఆజడదారిమనపాలిటికి నారదుండయ్యె

నార:—ప్రవేశించి (విష్ణునిసమీపించి) జయ. జయ. రమానాథ!

క. శరణు రమాహృదయేశ్వర
శరణు విహంగేశగమన ♦ శరణు ముకుందా
శరణు మునిహృదయమందిర
శరణు జగన్నాథ! భక్త ♦ జనమందారా.

(నమస్కరించును.)

విష్ణు:—ఈప్సితార్థ సిద్ధిరస్తు.

నార:—అమ్మలారా! (నమస్కరించుచున్నాఁడు.)

శ్రీ-భూ-నీ:—సుఖివై వర్ధిల్లుదువుగాక.

విష్ణు:—నారదా! ఆపీఠముపైఁ గూర్చుండుము. ఎచ్చటనుండివచ్చితివి. బ్రహ్మమొదలగు ప్రజాపతులకు నింద్రాదిదేవతలకును హరుఁడు కుబేరుఁడు మున్నగు దిక్పతులకును దక్షుఁగల జగంబులకు భద్రమా.

నార:—జగత్పతీ!

క. క్షేమము హరునకు విధికిని
క్షేమము దివిజేశ్వరునకు ♦ క్షేమం బలకా
ధామునకు ధర్ముఁడాదిగ
ధీమతుల కనామయంబు ♦ ధీజనవినుతా.

విష్ణు:—నారదా! సకలలోకంబుల కుశలవార్తఁ దెల్పితివి. అట్లుండ నీవ దనం బేమిరో దీనతఁ గన్పట్టుచున్నది కారణంబేమి.

నార:—భక్తజనచింతామణీ! విన్నవించెద.

సీ. కైలాసమున కేగి ♦ కాలకంఠుని జూచి
నాగిలి మ్రొక్కి య ♦ చ్చటవసింప
హరుఁడు నన్గని లోక ♦ మందునగలయట్టి
చిత్రంబులను మాకుఁ ♦ జెప్పుమనిన
బలిమి రక్కసులు సు ♦ పర్వులు మైత్రిచే
సాగరంబు మథించు ♦ సమయమందు
జలధిలోఁ గల్పకా ♦ దులు నుద్భవించుట
యమృతంబు వొడముట ♦ యసురులెల్ల

తే-గీ. అతిబలంబున గొనుటయు ♦ సమరు లపుడు
భయమునను మిమ్ము శరణంబు ♦ బల్కుటయును;
అవల మీరలు మోహినీ ♦ యతివరూపుఁ
బూని యసురుల వంచించు ♦ పోలుపుఁ దెలుప.

తరువాత మీరు సుందరరూపంబున బృందారకులకమృతంబొసంగుట యు దానవులు మోహవిభ్రాంతులై యమృతంబుపై నాసవిడిచి మీచే వంచింప బడుటయు వచింపఁ గామవశులై యమృతంబుఁ గోల్పోయిన దానవుల నా శంభుఁడు నిందించె. అంత నేను వారిననేల? మీరలైన నంతియేయన నా భవుండు నాపయిన్గనలి యేమంట్రి వేమంటివి కంటిమంటచే బూదించెదంట గం టిపేసిన జగదంటలైన నన్నెఱుంగక నారాయణుం డేమో ధీరంబుగల్గినవాఁ డని నోరికివచ్చినట్లెల్లఁ గారులంబేర్చిలకుమని నన్ను గద్దించె.

విష్ణు:—తరువాత తరువాత!

నార:—దేవా! యేనునివిన్నవింతును.

తే-గీ. కాముని౦ బరిమార్చిన ♦ ఘనుఁడననియు
పాపియగా మిత్తి నడచిన ♦ ప్రభుఁడ ననియు
శమను గర్వంబు వాపిన ♦ జాతననియు
దలఁచి మిము లెక్క-చేయఁడు ♦ దనుజదమన.

విష్ణు:—జరిగిన సమాచారమునంతయుఁ దెల్పుము.

నార:—స్వామీ! తనకును మీకును హస్తిమశకాంతరముం గలదఁట, తన వైరాగ్యంబుముందు మీమాయ లెంకులకుం బనికిరావఁట. ఈపరి విరించి ప్రముఖులమోల మీ సుందరీరూపంబుఁజూచి చిత్తచలనంబు నొందక తనమహామహిమంబులఁ దేటతెల్లమొనర్చునఁట. ఇందిరావరా! పలువు రున్నసభలో మీయాఁడురూపంబు నుగ్గడించి యెంత లెంతలు పరిహాసమొనర్చెను: మిమ్ము వినుతించినందులకు నన్నెంత యదలించె.

విష్ణు:—సరియే యప్పుడుతామసగుణప్రధానులగుప్రమథులూరకయుండిరా

నార:—దేవా! ఆపాట్లన్నియు విన్నపము చేసికొనెద. నందికేశ్వరాదులగు ప్రమథులందఱు నన్నుఁజుట్టుముట్టి గడ్డంబులాగియు జడలనూడ్చియు జన్నిదంబుఁదెంపి వైచియు కమండలంబుఁ బగులనడఁచియు నీపక్షపాతియగు వైకుంఠుం డనుకొంటివా యనియు నన్నుఁ బలువిధంబుల బాధింప రుద్రుండు వారి వారించి యిపుడీ జడదారితోనేమి యీాక్షణంబ వైకుంఠంబునకుంజని యావాసుదేవుండు దాల్చిన విలాసినీరూపముంగాంచి మనంబున భ్రాంతి నొందక నిబ్బరంబువహించి యవ్వల వీనిసంగతిఁ గనుఁగొనెదమని చెప్పె, భక్తవత్సలా! మదనుంజంపియుఁ గాలునిందోలియు హాలాహలంబుఁ బానంబుసేసియు త్రిపురులం బరిమార్చియు లోకంబు

లం గాపాడిన తనకీఁడెవ్వరని గర్వంబున విఱ్ఱవీఁగుచు నెల్లవిధం బుల, దనకుఁదీసిపోని యహంకారంబున శ్రీహరిని మేము గెల్చుము మేము గెల్చుమని ప్రమథులు వెంటఁజనుదేర పార్వతీ సమేతుండై యాశఁ డీవైకుంఠంబుఁజేర వచ్చుచున్నవాఁడు జగత్పతీ! మీరు గన్న యీతమ్ముచూలికడుపు చల్లనిదగుటంజేసి యిపుడా ప్రమథుల బారినుండి పరుగువారి మీమఱుఁగుసొచ్చితిఁ భక్తవత్సలా!

మ త్త. నాదుపాతముఁ దీర్పఁగాదొ యనాథ నాథదయానిధే
ఖేదమందితి శర్వభృత్యులు ♦ కేరి పాతము లాడిరే
సాదరంబున నన్నుఁగావఁగ ♦ చానరూపముఁబూనవే
యాదయాపర శర్వునిన్మరు ♦ లొందునట్లులొనర్పవే.

విష్ణు:—నారదా! తొందరపడకుము. ఆభవానీశుండు నాకన్యుండుగాఁడు. చీటికి మాటికి నాకరిపై నాకరు పద్దులుపూని పరస్పరము కలహింపం బూనుట పలువురిలోఁ బరిహాసాస్పదముగానుండును. ఇపుడాతని యనునయ వాక్యముల సమాధానపఱచెద. అట్లు వినఁడేని తరువాత యోజింతము.

నార:—భక్తవరదా! అట్లుపేక్షయొనర్పకుఁడు. అప్రమథులచే నవమానమొందిన నాయవస్థఁదిలకించి మున్ను వారియహంకారము లడఁపఁ బ్రియత్నింపుఁడు.

మ త్త. లేకయుండిన నన్నువారిట ♦ లేశమును నిలనివ్వరే
యేకడవ్వసియింతునన్నిఁక ♦ నెవ్వరిటుదయఁబ్రోతురే.

(పాదములపయిఁబడును)

లక్ష్మి:—నాథా! పాప మీమునిని వంతఁదీర్పుఁడు.

భూదే:—ప్రాణవల్లభా! యీనారదుని యవస్థఁజూడఁ జాలి కలుగుచున్నది. మీకు భక్తపరిపాలన యందేగదా మిక్కిలి ప్రీతి.

నీళ:—హృదయేశా! మున్ను మీరు పదాల్చిన యన్నవరూపంబుఁజూచి మంకుఁదనిని సనకయున్నదిగాన యిప్పుడగ్గిరీశుని యహంకారంబుఁ బాపునెపంబున నారదుని మనోరథంబును దీర్చి మరలమాకు నానందంబొసఁగుఁడు

విష్ణు:—దేవేరులారా! అటులే యొనర్చెద (నారదునిపైఁ వాత్సల్యముతో).

మత్త. నీకు దైన్యము నొంద నేల వి♦ నిం దృవర్తసయీ యెదఁ
నాకువారొకలక్కయే యెల ♦ నాగనై వలపించెదఁ.

నారదా! "ఎలనాగనై వలపించెదఁ"

నార:—(ఆశ్వాసముతో) దేవా! యేమి సెలవిచ్చితిరి?

విష్ణు:—"ఎలనాగనై వలపించెదఁ"

నార:—(ఆనందముతో) ధన్యోస్మి! ధన్యోస్మి! (గానముచేయుచు నృత్యమొనర్చును)

లక్ష్మి:—(నవ్వుచు) కలహప్రియా! ఈపదునాల్గు లోకముల సందటికి జగడములు సంఘట్టించు వంకన నెల్లరి గర్వంబు లడఁగునట్టు లొనర్చితివి గాని యీమదనారి విషయముఁ దలపెట్టవైతివి. నేటికీ కార్యమునఁగూడ విజయమునుఁబొంది నీకలహాశనుండను పేరు సార్థకము చేసికొనుము.

భూదే:—అమ్మా! కమలాలయా! పాప మీముని పోరుతిండియను పేరు వహించిన నేగాని మున్నితఁడు సంఘటించిన కలహములన్నిటికిని మన నాథుని ప్రేరణయేగదా యాధారము.

లక్ష్మి:—అవును మున్నొకపరి యినుపగుగ్గిళ్ళ నెపమున ఋషిపత్నియగు ననసూయకడకేగి నేనును వాణియు గిరిజయు నామె మోముల గరంబులు మొగిచి నిలచి జితోస్మి యనునటులొనర్చె.

నీళ:—దేవీ! అటులైనఁ గైలాసమునజరిగిన వివాదమున నారదునిదే తప్పందువా?

లక్ష్మి:—నిస్సంశయముగ.

విష్ణు.—(స్వగతము) ఓహో! జరుగఁబోవునది వేఱొకటియుండ నిపుడు శ్రీనీళలకే వివాదములు బయలుదేఱినదే. దేవియగు నిందిర యింతకుమున్నే నాయెడ నలుకమాని ప్రసన్నయైనది. యిపుడీమెపక్షము మాటలాడిన నీళకుఁ గోపమువచ్చును. ప్రియురాలగు నీళవైపు మాటలాడిన నీమెయింటనిలువకేగును. ఇపుడేమిచేయుదు? (యోచించి భూదేవివైపు సాభిప్రాయముగఁజూచును.)

భూదే:—(స్వగతము) ఈతగవు సరిదిద్దుకార్యము నాథుఁడు నాయందుంచినాఁడు కానిమ్ము (ప్రకాశము) అమ్మా! రమాదేవీ! ఇందు నారదునిదే తప్పు గానిమ్ము శంకరునిదే యొప్పుగానిమ్ము మనకేల నీవివాదములు మున్ను లోకహితంబుఁ గోరి సకల నిర్జరప్రార్థితుఁడై తనసముఖమునకేగిన మన కుసుమశరుని తనకంటిమంటచే మంటపాలొనరించిన ముక్కంటికి కంటుతన మెఱుంగవాయేమి?

లక్ష్మి:—(నిట్టూర్పు విడచి) స్మరించుచుంటిని. ప్రియసఖీ స్మరించుచుంటిని ఈనారదుని కలహనైపుణినిగుఱించి కొంతవచించితి నంతియె కాని యాశంభుని మూర్ఖస్వభావ మెఱుంగని దాననాయేమి?

నార:—అమ్మా! ఆప్రమథనాథుని చందమంతయుఁ జూతురుగదా! ఆవల తప్పునాదియేయని మీకుఁ దోఁచినచో నన్నేయనవచ్చును.

దౌవారికుఁడు:—(ప్రవేశించి) దేవా! జయము. ఉమాసహితుఁడగు గిరీశుఁడు ప్రమథగణములు గొలువ మననగరమునకు విచ్చేసి మొగసాల విడసి తదాగమనంబేలినవారికి విన్నవింపుమనిరి.

విష్ణు:—(సంభ్రమముతో) దేవీ! మహాదేవున కెదురేగుదుమా?

లక్ష్మి:—అటులేపోదము.

విష్ణు:—సఖీ వసుంధరా; పోవుద మురమ్మ.
భూదే:—నాథా చిత్తము.
విష్ణు:—చెలీ నీళావత్తువే.
నీళ:—ప్రాణేశా! ఇదో వచ్చితి. (అందఱునిష్క్రమింతురు.)



## పంచమాంకము—తృతీయరంగము.

(విష్ణుసభాభవనము. విష్ణువు శివుఁడు బ్రహ్మాదిదేవతలు నారదాదిమునులు లక్ష్మి, సరస్వతి, పార్వతి మొదలగువా రాసీనులైయుందురు.)

విష్ణు:—తే—గీ. పామరుల మానసంబుల ♦ భ్రమలుగొల్పఁ
దగిన నాయూఁడురూపంబు ♦ సొగసదేడ
మదనసంహార నీదు నె ♦ మ్మనమునందు
ముదము నిగురొత్తఁగాఁ జేసె ♦ పొదలుటేడ.

శివు:—రమేశా! అయిననాతండందఱి యెదుట నన్నిల్లిదంబు లాడనేల.
విష్ణు:—ఏమని యేమని.

క. అన్నువయగు నీరూపము
గన్నంతనె నాకు మరులు ♦ గల్గియు నన్నున్
నిన్నును మఱచెద వంచని
యన్నాఁ డీమానివర్యుఁ ♦ డళుకక సభలోన్.

విష్ణు:—అంతమాత్రమునకేనా!

క. కలహాశను పల్కులకున్
దలపెట్టఁగరాని పద్దు ♦ దలపెట్టి యిటుల్

కలహంబులాడఁజెల్లునె
చలమేటికి మనకు మనకు । చంద్రవిభూషా.

శివు:—ఏమీ! మనకు మనకందువు మీకును మాకును సామ్యమెక్కడ.

శా. కాలుందోలియు సామజాసురుని సం । గ్రామంబున
న్గూల్చి యా
భీలంబౌ గరళంబుమ్రింగి జగతిన్ । బ్రీతిన్విలోకించు నన్
బోలంజాలుదె వారిజాక్ష! వినుమీ । పోర్వ్యందుపంతంబు నీ
శ్రీలావణ్యమున న్నెలంగు హొయలుల్ । శీఘ్రంబవీక్షించెదన్.

విష్ణు:—శౌరి స్త్రీరూపు సొంపును నారదుని పంతమును జూడవచ్చితిరే
గాని తమవైరాగ్యము నించుక చూపరుగదా?

శివు:—(కోపముతో) చూపకేమి, చూపుటకేవచ్చితిని.

భృంగి:—(వికటహాసముచేయుచు) ఏమోయి వాసుదేవా! మీనారదుఁడు
మాయొద్ద నీస్తోత్రపాఠములఁ జదువునపుడు నీయాఁడువేసముఁజూచి
మేమెల్లరము మోహసముద్రమున మునిఁగి దరిగానక గుక్కిరి
మిక్కిరియై సుక్కుదుమని నొక్కివక్కాణించె. ఒకవేళ నామా
యాసముద్రమున మునిఁగి తలమున్కలై తాళ్ళప్రమాణమునకు వ
చ్చినపుడు కలవుగదా కమండలపుబుఱ్ఱలు కరములలోదండములు
వానిసహాయమున నీవలఁ బడవచ్చునని ధైర్యముతో వచ్చితిమి.
ఇఁకమరుగునకేగి నటివై తెరవెడలిరమ్మ.

విష్ణు:—ఓయీ! భృంగీ! నటివిగమ్మని యధిక్షేపించుచుంటివా? ఇపుడీ పుం
డరీకాక్షుఁడే నటియైనఁ బ్రేక్షకులగువీరు మరలెత్తితలయు మొ
లయు నెఱుంగక శివమాడఁబోయెదరు సుమా.

లక్ష్మి:—(నవ్వుచు) సఖీ! వాణీ! ముందే కయ్యమునకుఁ గాలుద్రువ్వునీప్ర

మథుల యహంకారపు భాషణంబుల కనుగుణముగా మనవిష్వ క్సేనుండు నన్నిలో యాజ్యముంబోని నటుల మాటలాడుచున్నాఁడు.

పర:—దేవీ, కమలవాసినీ! మామగారు శుద్ధసత్వమయ విగ్రహులుగాన నీప్రమథుల పల్చదనంపు పల్కులు వినుచు శాంతి వహించి యుండిరి గాని యందఱు నూరకయుందురా?

లక్ష్మి:—ఔనౌను.

వీర:—ఓయీ! అణిమా ద్యష్టవిభూతులంగలిగి యసమానంబులగు మహిమంబుఁచే నలరారు మమ్మెఱుంగక పేర్కొలుచుంటివా?

భృంగి:—(బింకముతో) మహాశివభక్తులమని యెఱుంగుఁడు. అందునను నేనసమాన పండిత ప్రవరుండను కాదు కాదు ప్రభుండను గాబోలు?

విష్వ:—(నవ్వుచు) అదిమా కెల్లఁ గనుంబెలియును

విష్ణు:—(మందహాసమొనర్చును)

నం:—(కోపముతో) ఏమోయ్! వాసుదేవా! ఈనీ నాలిమ్రుచ్చు నవ్వులంగట్టిపెట్టి మాపనుపుచేయుదువా లేదా?

పంచచామరము. సరోజగర్భు గర్వము న్వెసన్నివారించిమారునిన్
భరంబునైన కంటమంట । పాలొనర్చిసామజా
సురున్ రణంబునన్జయించు । శూలికీడెవండు నీ
తరంబెరుంగ నేరవింక । తన్వివాచు రమ్మిటన్.

విష్ణు:—(తలవంచి స్వగతము) ఔరా యేమి వీరిదురహంకారములు. కానిమ్ము మఱి కొంతసేపు పేర్కొలనిచ్చెద.

పర:—దేవీ! హరిప్రియా! యీనందికేశ్వరుని దురహంకారపు పల్కులు వినియు మామగారు తమకుఁగల్గినకోపము లతినవ్వుగా మార్చి తమలో నేమియో యోచించుకొను తీరుఁగాంచితివే.

లక్ష్మి:—వాగ్దేవీ! అదిగో శాంత వినయ గాంభీర్య భావములచే నలంకరింపఁబడి చూచువారల మనంబుల నాకర్షింపఁజేయఁ జాలు నాధుని వదన మండలముం గాంచుచు ముద్దరాలనైయుంటిని.

వంది:—ఓ వారిజాక్షా! ఊరకయుంటివేమి? ఇఁక మామోహిల నీపసువు నిలుపుకొను టెట్లని దిగులొందుచుంటివా యేమి.

భూదే:—చెలీ నీళా! సాటిలేని క్షమాగుణంబుచేఁ బ్రాణేశుఁడు మిక్కిలి శోభిల్లుచున్నాఁడు.

నీళ:—(స్నేహముతో) దేవీ! నీనాథునకది సహజాలంకారమేకదా!

భూదే:—(ప్రీతితో) నీళా! విశ్వంభరుఁడగు మనవిభుఁడు సకల కళ్యాణ గుణ నిలయుండుగదా; ఇందొరులఁ బ్రశంసింపవలయునా?

నీళ:—దేవీ! ప్రశంసనీయంబులగు నిట్టివినయసంపదలచే నలరారుచుంటివి.

భూదే:—అదిగో ప్రాణేశుండేమియో వారితో భాషింపఁబోవు నట్లున్నది.

విష్ణు:—ఓ ప్రమథులారా!

ఉ. తామసమేల మీకిపుడు ♦ తాపసవర్యుని పల్కులందు నే
కోమలరూపుఁ గైకొనినఁ ♦ గోరికలీరికలెత్త మీమరుల్
కామునిబారికగ్గమయి ♦ గ్రాగుటసత్యము స్వస్థచిత్తులై
సామమున న్మనుఁడు విర ♦ సంబువహించుటలగ్గుగాదిటల్.

శివు:—(వెడనవ్వునవ్వి) ఏమీ! కోరిక లీరికలెత్తమామరుల్ కాముని బారికగ్గమయి గ్రాగుటసత్యముగా.

విష్వ:—ఔను?

భృంగి:—ముమ్మాటికి.

విష్వ:—సత్యము.

శివు:—ఓహో! మించిపోవుచున్నదే! కమలాక్షా, లెమ్ము ఆఁడుదానవై యిటకరుదెమ్ము. ఇపుడే యీనారదుని పంతమును నావైరాగ్యంబును నీమాయయు బ్రహ్మాది సురలెఱుంగఁగలరు.

మనముఖ పడిలపటించుకొని యుండుము. (అనినిష్క్రమించును.)

(సభయాంతియు మాయమగును.)



## షష్ఠాంకము—ప్రథమరంగము.

---

(ప్రదేశము ఉద్యానవనము. ప్రమథులు శివుఁడును దిరుగుచుందురు.)

నంది:—దేవా! మృత్యుంజయా! మన వైరాగ్యముల మ్రోతలఁ దనవిలాసములు పనికి రావని భయమంది వాసుదేవుఁ డెటకో పారిపోయె.

వీర:—ఔను జక్కఁగాఁ జెప్పితివి. ఆవారిజాక్షుఁ డట్లు పారిపోయి దాఁగి యుండ మనమిచట నుండిన నెట్లగునోయని బ్రహ్మాది సురలును నారదాదిమునులును బలాయనమంత్రమును బఠించినట్లున్నది.

భృంగి:—వారు పలాయనమంత్రమునే పఠించిరో యనంగదేవుని యుపాసించి మనల జయింపఁ బ్రవేశమంత్రమునే పఠించుచున్నారో యానారాయణునియొద్దఁ గనుకట్టు విద్య కలదనివిందు.

వీర:—ఆమాయలన్నియు మనయొద్దనా సాగును.

భృంగి:—కాకున్న మఱి యెవరియొద్ద. చూచుచుండఁగనే సభవారెల్లరు మాయమగుటేమి? ప్రారబ్ధకర్మమువలె నంతుపంతులేని యీపువ్వుఁదోఁటయేమి యేమియో మనగతులెట్లున్నవో?

వీర:—చాలుచాలు నోరుమూసికొని యూరకుండుము.

భృంగి:—నోరుతెఱచినచో మీకుఁ గోపమువచ్చునన్న భయము. కన్నులు దెఱచినచో నావిష్ణుమాయ ప్రక్కఁదఁజూచి మోసపోవుదుమో యన్నభయము. మంచిచావేవచ్చినది. (అనికన్నులు నోరుమూసికొని పోవుచుండును.) (తెరలోగానము.)

భృంగి:—(వెనుకకుఁ బరువెత్తి భయముచే వణఁకుచు) ప్రమథులారా వచ్చుచున్నాఁడు వచ్చుచున్నాఁడు సిద్ధముగుండు సిద్ధముగుండు.

శివు:—ఓయీ! పిరికివాఁడా యెవరువచ్చుచున్నారు. దేనికి సిగ్గుపడుచున్నావు.

భృంగి:—(అటుచూచు) దేవా! మన్మథుఁడు మనపైకి దాడివడలివచ్చుచున్నాఁడుగాన మనమిప్పుడనంగసంగరమునకు కాయత్తము గావలయును.

నంది:—ఛీ! వదరుబోతా! కాంతలెవరో గానముచేయుచు నీశృంగారవనమున విహరించుచున్నారు. అటుచూడుము (తెరలో గానము.)

భృంగి:—అట్లయిన నాకుఁ బరమసంతోషము. అంతఁ [illegible]గా చంద్రికళయు మనోరమయు గానము నృత్యముసేయుచుఁ బ్రవేశింతురు పరిచారికలు మోహావిభ్రాంతు లగుదురు.)

మనో:—(దిక్కులుపరికించి) ఆహా! ఏమి యీవసంతభూపాలుని యసమాన వైభవము.

సీ. నేలయంతయుఁ జూడ ♦ నెఱిపచ్చికలసొంపు
గరుడపచ్చలఁ దాపు ♦ కరణిఁ దోఁచె
పాదపంబులు లేత ♦ పల్లవంబులుదాల్చి
కన్నులపండువై ♦ గానుపించె
శారికాకీరముల్ ♦ జదువు గానరవంబు
వీనులవిందు గా ♦ వించుచుండె
కుసుమ సౌరభములఁ ♦ గూర్చి గంధవహుండు
వేమరు చల్లగా ♦ వీచుచుండె.

తే-గీ. కమ్మపుప్పొడి దిశలందుఁ ♦ గ్రమ్ముకొనియె
భృంగ సంగీత ఝుంకృతుల్ ♦ నింగిముట్టె
విరహులను జెంద మదనుండు ♦ వెడలె దాడి
ఔర మాధవునాజ్ఞ యే ♦ మనఁగ వచ్చు.

చంద్రి:—ఓసీ! తెలియనిదానా! మదన మహీశునాజ్ఞ జగములందంతయు వెల్లివిరియుచుండ నడుమ మాధవుని వైభవమును గొనియాడెద వేల.

నంది:—(స్వగతము) ఆహా! యెవ్వరీపువ్వుఁబోడులు సానఁదీర్చిన సూనశరుని బాణములవలె నివ్వనమున విహరించుచున్నారు.

మనో:—ఓసీ! ప్రగల్భురాలా! విరహిజను లనియెడు మృగములను వేటాడఁ జనుదెంచు మన్మథ మహీశునకుఁ దోడునీడయై యద్దేవునకు విజయారంభుండగు వసంతునిం గొనియాడిన నాసూనశరుని నిరసించుటయని తలంచితివా?

భృంగి:—(స్వగతము) అయ్యో! దైవమా! అనుకొనినదంతయు జరిగినది విరహిజనులనియెడు మృగములం గెండాడ విషమాయుధుఁడు దాడివెడలి వచ్చుచున్నాఁడట రుద్రసంబంధులమగు మమ్మెవ్వరిం జూచినను గండశాసనుండగు నాతండు తినఁబగసాధించు. ఇఁక నేదిదిక్కు. (యోజించి) ఇట్లొనర్చి నన్ను నేను గాపాడుకొనియెదఁగాక (ప్రకాశము) ఓదయామణులారా! మీరా మదన మహీపాలుని పరిజనులలోనివారలా!

చంద్రి:—(నవ్వుచు) ఔను!

భృంగి:—(చేతులుమోడించి) కాంతలారా? అట్లయిన నన్ను మీకింకరునిగా ననుగ్రహించి యామదనునిబారిఁ బడకుండ నెచ్చటనైన నున్నత శైలమధ్యంబుల నునిచి కాపాడుఁడు. (పాదములపైఁబడును.)

చంద్రి:—(నవ్వుచు మనోరమవైపుచూచును)

వీర:—అరరే! ఈయిందుముఖి తనచిరునవ్వు వెన్నెలలు ప్రసరింపఁజేయుట తోడనే నామనఃకువలయము వికసించి మిక్కుటంబులగు వలపులు వెదచల్లుచున్నయది. ఇఁక నేదీనింబలుకరింపక యిచ్చోట నిలువఁజాల(లేచిశివుఁడున్నదిక్కుచూచి యాతనిం గానక) మాతండ్రి యిటలేఁడు ఆ! ఉన్ననన్నేమిచేయును. (అని చంద్రికయొద్దకేగును.)

చంద్రి:—(క్రేగంటఁజూచుచు నావలికేగును)

వీర:—(మోహవిభ్రాంతుఁడై యనుసరించుచు స్వగతము) ఈకామిని నాకు

సులభసాధ్యమే (ప్రకాశము)

విద్యున్మాలావృత్తము:- కాంతా నన్ను ♦ న్గావుము ప్రేమన్

కాంతుం డేమో ♦ గారియ పెట్టెన్.

చంద్ర:— ఇంతుల్వేడన్ ♦ నేకతముండన్

చెంతన్ప్రీతి ♦ న్నేరను మేలే

వీర:— కామినీ! ఊరక చెంతఁజేరుటచే విడతునా (అని దానియొద్దకేగుచుండ నదిచెట్టుచాటునకేగును.) చంద్రికయను భ్రాంతిచే వీరభద్రుఁడు చెట్టును గౌఁగిలించుకొని ముద్దుకొనును.

మనో:— చెలీ! చంద్రకళా! కామదేవుని సామ్రాజ్యింపఁ బారిజాతములును పద్మకిరీటమ్ములునుగా పెన్నమ్మిపంపిన మనయొడయుని రాజ్యమాజ్ఞ నుముఱచి యిందుమసలినవెట్లు? నీవుపోయి కమలములు గోయుము. నేనీపారిజాతముల గ్రహింతును (పూలుగోయుచున్నది.)

చంద్ర:— చెలీ! అలాగే; (అనిపోవును. వీరభద్రుఁడు దానివెనుక నేగును.)

నంది:— ఆహా! యీమనోహారిణిజూడ నాకుమరులెత్తుచున్నది యేవిధము చేనైన నేదీనితో సఖ్యమొనర్పవలయు మాప్రభుఁడగు రుద్రుండిదిగని దండింమనుగదా. శివుఁడున్నదిక్కుఁజూచి యతనింగానక పెద్దనవ్వునవ్వుచు బలే! శివుఁడులేఁడు శివుఁడులేఁడు నాయదృష్టముపండినది [అనిమనోరమ వెనుకగా నేగి యామెకు గిలిగింత పెట్టును.]

మనో:— (వెనుదిరిగి) ఎవఁడీయెద్దుమొద్దు స్వరూపము.

నంది:— [సంతసముతో] సుందరీ? నాకీమాత్రముమాటయే పదివేలు నేనీదాసుఁడను. అందనిశాఖ నందికొనుచుఁ బూలుగోయుచున్న నీకు శ్రమ గలుగకుండ విరులంగోసి యొసంగవచ్చితి (అనిపూలుఁగోసి మనోరమకొసఁగఁబోయి యామెపైఁజల్లును.] వానిసదలించుచు)

మనో:—సురానందవృత్తము.

సరిసరిపోపో ♦ సరిగాదిటులన్
సరసిజనేత్రిన్ ♦ సరిగా పలుకన్

నంది:— కరిగమనన్నిన్ ♦ గనినన్ బెలుచున్
మరుడదెనోంచేన్ ♦ మార్గణరాజిన్.

(అని దానిచేయి పట్టుకొనం బోవును.)

మనో:—వానినావలకు గెంటుచు నింతకుమున్ను నారాయణునియొద్ద మీ రాడిన ప్రగల్భములు జ్ఞాపకమున్నవా.

నంది:—(ఆకసమువైపు చూచుచు) ఆ! ఆ! ప్రగల్భములా—మేమా—ఆడితిమా—ఏమని? ఏమో నాకేమియు స్ఫురించుటలేదు.

భృంగి:—(ధైర్యముతో నికిలించును) ఆ! స్ఫురించినది. స్ఫురించినది. సరస రసికవరులకన్న సరసులగు పురుషవరులమని. అదియేనా!

మనో:—మీచందమగ్గిరీశుండెఱింగనేని తప్పక దండించితీరును.

నంది:—ఆ యర్ధనారీశ్వరుని వైరాగ్యమునకు మమ్ముదండింపవలయునా?

భృంగి;—దారుకావనమునందలి మునిపత్నులకై పలుపాట్లుపడి తుదకు పెను బండవంటి శాపమును నెత్తినంబెట్టుకొనిన యాశంభునికన్న చెడిపోములెమ్ము. ఒకవేళ మమ్మంతగా దండింపంబూనినచో "యథా రాజా తథా ప్రజాః" అని మున్ను ఋషికాంతలకై మీరనుభవించిన చిక్కులను స్వానుభవముచే నెఱుంగందలంచి యిట్లొనర్చితిమని ప్రత్యుత్తరమివ్వంగలము. కానియ్యవోయ్ పాణిగ్రహణమహోత్సవము దగ్గరనుండి యాజ్ఞిక తంత్రము నెరవేర్చెదను.

నంది:—(అంగవస్త్రము నడుమునకు బిగదీయుచు) చెలీ! అనుగ్రహింతువా (కౌంగలింపంబోవ నది పాదమాటునకేగును మనోరమయను తలంపున లతను గౌంగలించి యదికాదంటచే వెదకికొనిపోవును.)

భృంగి:—(పెద్దపెట్టున నేడ్చుచు) అయ్యో! మాయముండ లెవ్వరోవచ్చి మావీరభద్రాదులను వలపించి కనుమఱగిరి. వీరావేశసగత్తియల వలలంగగులుకొని వారినుసరించి యెటకోపోయిరి. నేనును స్మశానమునం దిరుగు నక్కవలె నామిత్రులకొఱకీదిక్కుమాలిన వనమంతయు వెదకి వెదకి వేసరి యొంటిగ వారిజాడ తెలియఁగఁజాలనైతిని. దైవమా! యిట్లొంటరినైయున్న నన్నొక తుంటవింటి కొంటెబంటు తనకంటు తీయు నాపైఁజూపునేమో గదా (యోచించి) నాప్రాణముల నీవిధముగాఁగాపాడుకొనియెదను. ఈనాపాడుబొజ్జు శరీరమున నెటఁ బరీక్షించిన నన్నియుఁ బిలికి కండలుదక్క యభిమానమును ధైర్యమును గల్గిన దొక్కటియును లేదు. ఇపుడు నాకంటు నెవరు పడినను నన్నుఁగాపాడుఁడని వారిపాదములపైఁబడి మొఱపెట్టెద. పైసాలేనివాఁడు పరస్త్రీవర్జితుఁడుగదా? అభిమానశూన్యుఁడనగు నాకదియే మంచిత్రోవ. (అనియొకచెట్టుక్రిందఁ బతికిలఁబడును) తెరలోగానము) (భయముచే నిటునటుఁబరువెత్తుచు నోదయామయులారా! కాపాడుఁడు కాపాడుఁడు.

విలా:—(ప్రవేశించి) ఓయీ! నీవెవ్వఁడవు ఏలనిట్లఱచుచుఁబరుగిడుచున్నావు.

భృంగి:—(ధైర్యముతో స్వగతం) నన్నీయెడరూపఁ గాపాడుటకు మంచిపాత్రమే దొరకినది. (ప్రకాశము) కాంతా వచ్చుచున్నది వచ్చుచున్నది.

విలా:—మూర్ఖుఁడా! ఏమివచ్చుచున్నది.

భృంగి:—మదనునిసేన. ఈసమయమునమనముదూరదూరముగా నుండినఁ గ్రూరుఁడగుమారునినారాచములకు గుఱిగాఁబోయెదము గాన మనమిప్పుడొకరి కొకరము సహాయులమై సిద్ధముగానుండవలయునుసుమా!

విలా:ఎందులకు

భృంగి:—మదనకదనమునకు.

విలా:—బ్రహ్మచారీ! మర్కటమువంటి నీకుగూడ నింటులకు నాబోటి బోటులు సహాయులైయుండవలయును గా

భృంగి:—సుందరీ! ఇట్లు బ్రహ్మచారులమై నాకమ్మవిల్తుండు దనవాడియమ్ములం జిమ్మి నామ్మనస్సింజేయునని యెంచిన వాండనగుటచేఁగదా నిన్ను నాకు ద్వితీయగాఁజేసికొని యారతీశునిం జయించి దుర్భరంబగు నీబ్రహ్మచర్య వ్రతమునకు జలాంజలి సమర్పింపనెంచినాఁడ. ఇవిగో ముందుగా నీకీసుమాంజలిన్నొసంగెద నను గ్రహింపుము (అనిదానిపైఁ బువ్వులు జల్లును) (వానినదలించుచు)

విలా:—సుందరీవృత్తము

సరస రసికవరుఁడవౌదు ♦ చాలుఁబొమ్ము పొమ్మికన్

భృంగి:— మరునిశరము తరముగాదు ♦ మాన్యరమ్మురమ్మికన్

విలా:— హరుని భటుఁడవగుచు మన్మ ♦ దాంగనాళిఁ గోరుదే

భృంగి:— హరునిగిరుని నెఱుగనన్ను ♦ మాస్త్రిబారిఁద్రోచెదే

(అని దానిఁగౌఁగలింపఁబోవ)

విలా:—(వారినివారించుచు) అప్పుడే యేమైనది హస్తములుజాపుటకు ముందున్నది వీనికు మనసెళ్ళపండుగ (నిష్క్రమించును)

భృంగి:—(విలాసవతి యనుభ్రాంతిచే దరువులను గౌఁగలించుచు ముద్దిడుకొనుచు (నిష్క్రమించును.)

(అంత మోహిని కొందఱుచెలులతోఁ బ్రవేశించును)

మోహి:—సఖులారా! మన్మథ వసంతులం బూజింప కుసుమములం దెమ్మని పంపిన మనమనోరమ చంద్రికళ లింతదనుక రాక తడవుసేయుచున్నారు. వారిం ద్వరపెట్టి తోడితెమ్మనిపంపిన నాసఖి విలాసవతియు నందే మసలినది

చెలులు:—సఖీ! వేఱుకారణ మేముండును వారీ వనరామణీయకముల్ గాంచుచు మైమఱచి వినోదించుచుందురు. వారు వచ్చునందాక మనముగూడ నిట వినోదించుచు విహరింతమురమ్ము

మోహి:—అటులే యొనర్తము. ఆహా! యేమి యీకోకిలారావ మనోహరము

ఉ. భాసురగాత్రి జూచితివె ♦ పాయని వేడ్క రసాలపల్లవ
గ్రాసమొనర్చి కోయిలలు ♦ కందువగుంపులుగూడి ప్రోడలై
మాసుతు కీర్తనంబులను ♦ మక్కువమీరఁగఁ బాడె గానముల్
జేసెడి సొంపుఁ గాంచితిరె ♦ చేడియ యారఁగ కలస్వనంబులన్.

కావున మనముగూడ నీకలకంఠములకు సహాధ్యాయినులమై యొక్కించి తడవు గానమొనర్తమురండు (గానముండి వీణావాదన మొనర్తురు.)

శివు:—(ఒకవైపునుండి ప్రవేశించి స్వగతము) ఆహా! యీపరికలకంఠులు, తమ యసమాన గానమాధురీమహిమచేఁ గలకంఠములనుగూడ మోగములు సల్లపఱచుకొని కనువేర్పుఁజేసికొని కాననంబులం గలసిపోవునట్లు లొనర్చుచున్నారు. (పరికించి) అబ్బారే! యీసుందరరమణు లంపతిచేఁ బరివేష్టింపఁబడి చుక్కలలోని చంద్రునివలె శోభిల్లు నీశోభనాంగి యెవ్వరు. ఆహా! యేమి యీపాటసొంపు.

సీ. కలకంఠకంఠ సం ♦ గతిని సొంపులనింపు
గానమాధురికి రా ♦ ల్కరఁగుచుండ
వరుస గానామృత ♦ వర్షసేచనమున
చేరువ మోఁడులు ♦ చిగురులెత్త
హరిణీ సమూహముల్ ♦ నతివేడ్క దరిఁజేరి
చెవులు రిక్కించుక ♦ చేరిచూడ
స్వరసంగతికి మెచ్చి ♦ వర భుజంగావళి
హాయని దలలూపి ♦ యాడుచుండ

తే.సీ. రహిని మధ్యమ షడ్జ స్వ ♦ రములతోడ
శ్రుతియు లయయును రాగము ♦ ల్జోడుచేసి

చెవుల కమృతంబు సోనలై ♦ చిందునటులఁ
బాటఁ బాడుచు నున్నదీ ♦ బోటిమిన్న.

ఔరా! అన్నివిధముల సుగుణముల కీమగువ స్థానభూతురాలివలె నున్నది, సృష్ట్యాదినుండి యిట్టిచక్కదనంబున కిక్కయగు చెక్కులాడి నెందును గానసైతి, ఆహా! ఈయన్నుమిన్న యెవ్వాని సొమ్మోగదా? వలపుల కాణాచియగు నీయలరుఁబోడింగూడి వలరాచవాని చెయువులం దనియుఁవాఁ డెట్టి భాగ్యవంతుఁడోగదా? కట్టా దీనిని జూడఁజూడ నాకు మరల వెఱ్ఱియెత్తుచున్నది. ఇఁక నేనీ కీరవాణితో మాటలాడక యొక్కనిమిషమైన నిల్వఁజాల పరిక్రమించుచు సంశయించి, నారాయణుం డీతీరుంగాంచి నన్నధిక్షేపించునేమోగదా ఆ! అధిక్షేపింపనిమ్ము అల్లున కల్లుఁడవైననీవు చదివినబడిలో నేనును జదివితినని ప్రతివచనంబిచ్చెద ముందునకు నడచి మరల సంశయముతో ఆ! ఈమించుబోడిం జూచినకొలఁది మితిమీరిన తమి మేననిండుటచే దేహమంతయు గంపించుచు ముందునకడుగిడుటకు నాపదములు దడపడుచున్నవి. (యోచించి) ఇపుడు నేనే సందర్భము కలుగఁజేసికొని యీమంజువాణితో సంభాషించెద. ఈవిలాసిని నావిభవములంగాంచి మెచ్చునా? ధైర్యముతోఁ గానిమ్ము నన్నుమించినవారెవ్వరున్నారు. సాహసించి పూనినచో నెట్టిదుర్ఘట కార్యమునైనను సాధింపవచ్చును. సమీపించును.

మోహి:—చెలులారా! ఇచట నెవ్వరో పురుషులున్నారుగాన మనమిట నొంటిగా నుండుట మఱియాదగాదు వేఱొకతావున కేగుదమురండు నిష్క్రమింతురు.

శివు:—ఆహా! పొరపాటొనర్చితినిగదా! యేతరుమూలననైన డాగి యీ యిందుముఖి విలాసాదులఁ గాంచక వెడగునై యదటున సమీపించి యీరామామణి స్వేచ్ఛావిహారములకు భంగపాటొదవించి మూఢుండనైతి. ఇదికులకాంతయా కానిచో నన్నుఁగాంచి మఱుఁగుపడనేల

కట్టా! యివ్వనసీమ నాజవ్వని యెందుండెనో తెలియంగఁగలను కానిమ్ము. ఎటుపోదును? సలుగడలను వెదకి యది మఱేఁగినజాడం గని పెట్టెద పోవుచుఁ బార్వతి యీ నావ్యాపారమెఱింగి నాపై యలుకఁబూను నేమో ఆ! పూననిమ్ము. ఆపె యలుక కిఁక నే నులుకువాఁడనుగాను. ఇఁక నా కా కులుకులాడితోడి చెలిమియే సంతోషదాయకము గాన ప్రియాన్వేషణమునకై కడంగెద. (నిష్క్రమించును.)

మోహి:—ప్రవేశించి చెలులారా?

ఉ. కూరిమి నీరజంబులను ♦ గుందములన్ లసితోత్పలంబులం
జారు సువర్ణమై యలరు ♦ చంపకముల్ విరజాజులెల్ల న
వ్వారిగఁ గూర్చియున్ మహిత వాసితమై యలరారు బంతులన్
గోరిక నాడఁగావలయుఁ ♦ గోమలులార ముదంబు పెంపునన్.

ఆ పూలబంతుల నిటు తెండు సఖులట్లొనర్తురు. అందఱును బంతులాడుచుందురు.

శివు:— పొదమాటుననుండి ప్రవేశించి సంతసముతో నిదిగో నాప్రాణము. ఇదిగో నాపెన్నిధానము. ఇటుఁ దోట్రిచేడియలంగూడి వేడుకమీఱ నాడుచున్నయది యేమి యీ కందుక క్రీడానైపుణ్యము.

సీ. కైదమ్మిరుచులచే ♦ గలసిరక్తిమ జెంది
మహితమైన ప్రవాళ ♦ మణియనంగఁ
గలికి వాల్జూపులఁ ♦ గలసి నీలిమఁ జెంది
కొమరొందు నీలంపు ♦ గుండనంగ
హాసచంద్రికలచే ♦ నలరి యొక్కొకవేళ
భాసిల్లు వజ్రాల ♦ బరణి యనఁగ
కుచకోకములఁ గూడి ♦ కోరియాడెడు వేడ్కఁ
బరతెంచు జక్కవ ♦ పక్షి యనఁగ.

గీ. గడియకొక్కొక విధముగాఁ ♦ గానుపించి
చూడఁజూడఁగ నొకవింత ♦ సొగసుగలిగి
కమ్మతావులు దిశలంను ♦ గ్రమ్మ నలరు
బంతి నాపంచు నున్నదీ ♦ యింతి మిన్న.

సాహసించి యిపుడు దీనిసముఖమున కేగుదునా? వలదా "ఆలశ్య మమృతంవిషం" బనునీతివాక్యమనుసరించి యిఁకనిట యోచించుచు జాగొనర్చితినేని యిదిమణియొక తావునకుంజనునేమో. ఇపుడించుక సాహసించి వెనుక కనుక గానేని దీనింగాఁగలించి యవ్వల నానరసంపుభాషణంబుల లోఁ బఱచుకొని యెదనని మోహినిడాసి యేమఱించి పట్టుకొనంబోవ నది యదృశ్యయగును.

శివు:—అక్కటా! ఇది యే మాశ్చర్యము. ఆ కెమ్మలాడిపై నెక్కొను మిక్కుటంబగు మక్కువం జిక్కఁబట్టనేరక గ్రక్కునంజని యక్కునంజేర్చి నామక్కువఁ దీర్చికొనందలఁచిన నాచక్కదనంపుఁబోఁడివు కన్నుమొఱఁగి పోయెఁగదా? ఇదేమి మోసమా నిజముగఁ గలికిగదా!

మ. కలయో నిక్కవమో భ్రమంబొ నిజమా ♦ కాంతాల లామంబొ యా
జలజాతాస్త్రునిమాయయోకటకటా చంద్రాస్య చేఁజిక్కియుఁ
కలలోఁ గాంచిన కాంచనంబుపగిదిన్ ♦ గ్రమ్మయెందేగెనో
వలపుల్ మిక్కుటమయ్యెనింకిటులనోర్వన్నోప్రదునేనక్కటా

ఈ మదనానల మేతీరున భరియింతును. ఏచందంబున నేనయ్యిందుముఖిం దర్శింతును యేయనువూని యావనితారత్నంబు మనంబు ననుందగులొందునట్టు లొనర్తు. ఎందుబోదును, యెవ్వరివేడుదు నేరీతిఁ దాళుదు. ఇఁకనిట్లు దైన్యంబునొందుచుఁ జేష్టలుమానియున్న కార్య మనుకూలింపనే

రదు. ఎట్టులైన నామిత్రారియున్న తావునకుంజని నామనోభావం బెఱింగించి నేదానిస్నేహంబు వడసెద (నిష్క్రమించును. మోహిని డోలావిహారముతోఁ గనుపించును.)

శివు:—(మఱియొకవైపునుండి ప్రవేశించి నాఁగిచూచుచు) అయ్యారే! యేమి యీ యొయ్యారి యూయ్యాలలూగు నొయ్యారము. ఈ పల్లవాంఘ్రి పాదయుగము డోలికాగమనంబున కనుకూలించు తీరున మాటిమాటికి భూమిందన్నుచుండునపుడు గల్లిన నీకలికి యందియలు ఘల్లుఘల్లుమని మ్రోయురవళికి నాయుల్లంబు ఝల్లుఝల్లుమనుచున్నది. అబ్బరా! ఈ ముద్దుగుమ్మ తన తూఁగుటుయ్యాల వేగంబును మఱింత హెచ్చింప నాకపించు హొయలుగా నిగుడించు తన మేని కాంతులచే నింగియంతయు బంగరుపూతఁ బూయుచున్నది, ఆహా! ఈవిలాసినీమణి సౌందర్యంబుఁ దనివితీరఁ జూచుటకు నేను సహస్రాక్షుండఁగానైతిగా. ఈ జగన్మోహనాకారతోడి సాంగత్యమెంతటివారికి లభించును.

సీ. చెలువొప్పగా నేను ♦ చేఁబూనపై దాల్చిన
పడతి చన్బంతుల ♦ పైనునుండు
కరము వేడ్కసెలంగ ♦ విరిసరంబైయున్న
నబ్జాక్షి తన శిర ♦ సావహించు
బాగుమీరెడు విరి ♦ బంతినై యున్నచో
సతివ నన్నేపట్టి ♦ యాటలాడు
అతివేడ్క బాగార ♦ హారమైయున్నచో
రమణి లేఁజన్గుబ్బ పై ♦ వసనుండు.

గీ. కల్కి కరములనుండు రా ♦ చిల్కనైన
నొప్పులాడికి ముచ్చటల్ ♦ జెప్పచూడు
కటకటా దీనితో నొండు ♦ గాక యితుల
నెందులకు నున్న వాడనో ♦ యెఱుగరాదు.

(ధైర్యముతో) ఐన నిపుడుమాత్రము చెడినదేమున్నది. ఇకఁదగుర బూని యావగలాడి నేమరించి బలిమినట్టి నామనోరథం బీడేర్చుకొనియెద.

మోహి:—(శివుని గ్రగంటఁ జూచుచు సఖులతో) చెలులారా! ఈస్థలముం జూడభుజంగావాసము వలెనున్నది. కాన నిఁక నకుల ప్రతిపాల నమే శ్రేయోదాయకముగా నుండును.

శివు:—(స్వగతము) ఆహా! ఈపోల్కిడననున్నంజూచి తనతోడిచేడియలతో నీభుజంగావాసమున నకుల ప్రతిపాలనమే భద్రమని వారితో ముచ్చటించులాగున ధూర్తులగు పురుషులకుఁ దావగు నీవనమున గాంతలు కృతమకులశీలములు వదలి వీరకనుకూలముగా వర్తించు టయే శ్రేయ మను భావమునుసూచించుచున్నది. ఔరా! ఇది యెంతచతుర. ఈయంగనామణి నాకిఁకఁ గొంగుబంగారమే! ఇఁక సమయానుకూలమగు సంభాషణమున నే దీనితోఁ జెలిమియొన ర్చెద. (సమీపించును.)

మోహి:—(తొలఁగినిలచి విలాసముగా) మహేశా! కాంత లేకాంతముగా విహరించు తావున నిట్లొంటిగా సమీపించుట విా బోఁటి వారలకుమేరలా?

శివు:—(విలాసముగా) కాంతామణీ! దురాంతుఁడగు కాంతుండొనర్చు రంతులకు నీభృతుండనై చతురుమతివగు నీసొద్ద నావెతలం దెల్పి నిను శరణంబువేఁడ వచ్చితి. కోమలీ! ఇపుడా కాముని దండించి నా బాములఁ దీర్చి కాపాడుమా?

మోహి:—కాముని జయించిన ధీమతివి గావా నీవు.

శివు:—మదవతీ! ఆమదనుం డిపుడు మనసిజుండై పలుతెఱంగుల సాధించుచున్నవాఁడు.

మోహి:—మానసారులు నీయధీనమందున్నవిగావె. ఇఁక నిన్నాసూనశరుం డేమి చేయంగలండు.

శివు:—మనోహారిణీ! ఇపు నా మానసంబును ధైర్యంబును నీసౌందర్యామృత రస ప్రవాహ వీచీపరంపరలంబడ మునిఁగి తేలుచు నందే లీనమైనవిగాన కరుణామయీ! నన్నీ మోహసాగరమునుండి దరిఁజేర్పుమా.

చెలి:— సఖీ! మనవీతని గ్రకురించి మఱియొకవైపున కేగుదము (రమ్మి.)

మోహి:—అటులే (ప్రకాశము) మహాదేవా! నీదేవి నెదుటనుంచుకొని యితర సతులమగు మాతో నిట్టి దిట్టతనంబుమాట లాడుటకు నీకు మేమంత చుల్కనగాఁ గన్పించుచుంటిమిగా.

శివు:—(నలువైపులం జూచుచు) ఏదీ! జ్యోత్స్నా దేవివలె నెచ్చటనున్న దాదేవి? పురాకృత కర్మమువలె బాగుగా దాపరించినది.

మోహి:—(నవ్వుచు) రాజశేఖరా! రాజుంజూచినకంట మగనింజూచిన మొట్టబుద్ధి యగునట్టున్నదిగా

శివు:—సుందరీ! నిర్మల మందాకినీ వీచికలం దూగఁదలంచు రాయంచ యితర తటాకముల నెంచునే.

మోహి:—అర్ధశరీరమిచ్చి మన్నించితివని విశ్వసించియున్న గౌరిపై నిట్టి యసూయ యెప్పుడు గల్గినది.

శివు:—అర్ధశరీర మొసంగితినని విఱ్ఱవీగు నాపె కిఁక నర్ధచంద్రప్రయోగమున నాయహంకారముడిపి యావలకు నంటి యిఁక నీయనుగ్రహంబునకుం బాత్రుండనయ్యెద చూడుము (అని పార్వతి యట నున్నదను నసూయచేఁ బోవుచున్నాఁడు.)

మోహి:— చెలులారా! ఇదే సమయము పోవుదమురండు (నిష్క్రమించిరి.)

శివు:— (ప్రవేశించి విషాదముతో) అక్కటా! చెడితిని చెడితిని నెన్నిధింగో లోనయి పేదనైతినిగదా! బాపురే నావంటి మందభాగ్యుడు కాంచందగు గంధితోడి పొందు లభించునా? లభింపకున్న నెట్లు తెలియుండు. ఆరామామణి యెవ్వరోగదా! దానింజూచి నాకిట్టి వెఱ్ఱి నురు లేలగలై. ఆహా! యేమాయొప్పుల కుప్పయొయ్యారము. ఈ సమస్త జగంబులలో నెందును దానికాల్గోటి కెనయైన బోటినిగాన. కట్టాయేమి సేయుదును.

ఉ. సామజయానలగ్నలసి ♦ సంతస మొప్పగ మాగుటుయ్యెలల్
వేమరునూగియూగి కడు ♦ వేడ్క నెలంగవనింజరించుచుక్
కాముశరంబుపోల్కి క్రిజ ♦ గాంబులమోహమునింపజాలునా
కామినితోగ చుచుంగనిటగ ♦ గన్నులుగట్టినయట్టులక్కటా!

హా! భరింపజాల, భరింపజాల. (మూర్ఛిల్లును, కోకిలకూయును)

శివు:— (మూర్ఛదేరి) కలకంఠీ పిలచుచుంటివా? ఇదిగో వచ్చితిని. (ముందునకు నడచి కోకిలగని) కలికిగాదె కలకంఠమా? మోసగించి యేల యింతచెడవా? నీకు నేనేమి [illegible]సర్చితిని? రతీశా! నన్నీతీరున వెతలఁబెట్ట నీకు న్యాయమా?

సీ. మదన నీవశుఁడనై ♦ మగువ కరధ్రశరీర
మిచ్చి మన్నించుట ♦ లెంచవలదె
పేర్మితో మతనిన్నుఁ ♦ బెట్టిగా నాశీర
మందుంచు కొలుగవే ♦ చందమామ
చికుశత్రువు లౌను ♦ నెగడు ముల్బట్టి
బంధించు కొలుగవే ♦ పవననివ్వు

గాత్రమిూకొసఁగెయుఁడా ♦ కుసుమయూపుని వాల
ప్రేమతోను [illegible] ♦ పికములార

తే-గీ. సరవి మిూకెల్ల చేయుద ♦ సఖుఁడనైన
యట్టి నేనిట్టు తాపంబు ♦ నందుచుండ
నాతెఱఁగునుగని మిూరు ♦ నయముమిూఱి
చలముఁగొందురె యుపకృతుల్ ♦ దెలిసి నలరె.

(తెరలో చిలకపలుకును.)

శివ:—(ఆశ్వాసముతో) అదిగో! శుకవాణి యప్పుడఁడనతోఁటి నెచ్చెలులతో ముచ్చటించుచున్నది. ఇపుడు నేనచ్చోటఁ కరిగి నాయిచ్ఛ నెఱిఁగించెద. ఇఁక నామోసగత్తె నాయభీష్టము నెఱవేర్పఁబూనినచో సరియు లేకున్న నాగట్టివాయి ప్రకృతిమెయింబట్టి భోగించెద. ఇఁక నిదియె యుపాయము (నిష్క్రమించును.)



## షష్ఠాంకము—ద్వితీయరంగము.

---

మోహి:—(చెలులతోఁ బ్రవేశించి కుసుమాపచయమొనర్చును.)

సుగంధివృత్తము:- వారిజాక్షులార కమ్మ ♦ వాసనల్ చెలంగు నీ
పారిజాత పూవు లేరి ♦ బంతిఁ గూర్పఁగాఁ దగున్
సన్నుతాంగి మల్లెరాజి ♦ చంపకాలు జాజులున్
పొన్నపూల నేరి మాగఁ ♦ బూజసేయఁ గానలెన్
యింతిమిన్న చూడుమిందు ♦ నింపు నింపుమిన్న చె
ముంతిపూలఁగోసి చెండ్ల ♦ మాలిక గూర్తమిూయెడన్

అంబుజాక్షి యీ సరోవ • రాంతరంబు నొప్పు నా
పుండరీక పాళిఁ గోయఁ • బూనిరంత రాఁడికన్.

శివు:—(ప్రవేశించి సంభ్రమముతో) ఇదే యీ పూలపందిరుల చెంతఁ దనతోడి బిసరుహాక్షులతోఁ గుసుమంబులం గోయుచున్న దీకుసుమగంధి. ఇఁక దీని నేమరించి పట్టుకొను యసాధ్యము గాన నిప్పు డీసుముఖి సముఖమున కేగి పలువిధంబులఁ బ్రార్థించి ప్రసన్నురాలిం జేసికొనియెద.

మోహి:—(తొలఁగినిలచి) కైలాసవాసా! మాటిమాటికి మాబోంటి బోటు లుండఁ జోటుల కిప్పాటున ననుదెంచుట నీబోంటి పెద్ద ఘనునకుఁ బాటియే.

శివు:—(దీనతతో) లతాంగీ! యేల నన్నలయించెదు యీనాహృదయభారం బెఱుంగ నేరని ముద్దరాలివలె భాషించుచుంటివి. వినఁ గుతూహలంబయ్యెనేని యిదిగో యొకసారి పదిసారులు నూరుసారులు లెక్కలేనన్ని సారులు నుడివిచేసుకొనియెద విలాసినీ! నేను నిన్ను త్రికరణశుద్ధిగాఁ బ్రేమించితిని. అనుగ్రహింతువేని నేనిన్ను నా హృదయాధిదేవతలెఁ బూజింతును. కామినీమణీ! ఇది మొదలెన్నఁడు నిన్నుఁబాయక యహర్నిశలు కామకేళులం దనియించెద, మితిలేని యానందాంబుధి నిన్నోలలాడించెద,

ఉ. సురుచిర గాత్రి నిన్ననుఁ • జూచినతోడఁ గరంబు క్రూరుఁడై
మరుఁడు శిలీముఖంబులను • మాటికిమాటికి నేర్చి నాపయిన్
బరుపఁగసాగె నీయతను బాధకు • నోరువఁజాల నింక నో
తరుణి రొనత్కృపారసము • దార్కొనఁ గౌఁగిటఁ జేర్చి ప్రోవవే.

మోహి:—(కౌఁగిలింపఁబోవ దూరముగా నిలచి) పార్వతీవరా! యెంతగడుసు వాఁడవు. కొంచెము జంకులేక లోకంబుననుండు నెలనాఁగలం దరిసి మాయకేళులం దేలఁ జూచెదు.

గీ. సతుల నిద్రంగూరి ♦ సంతసమున
రతుల నలరెడి ప్రియు ♦ సతులంగాంచి
మగలు ... ♦ ర్గము మహేశ
నిచ్చలును నీను ... ♦ మెచ్చవచ్చు.

**శివు:**—కాంతా! అట్టి యొకపురాండ్రగు సతులే యెప్పుడది యుండినను సౌఖ్యముండునా?

గీ. ఆకసంబున ... ♦ ...
రాత్రులందున ... ♦ ...
... ♦ ...
కాంతులలరించెడి చంద్రు ♦ కళ లరాగి

**మోహి:**—ప్రమథాధిపా! యెందుల కిట్లు మెచ్చుచుంటి లాగుడవు. పురుషు లారంభమున నిట్టి యిచ్చకంపుం బలుకులచే మచ్చికంటులం జేలు పుచ్చి వారిం దమవశ మొనర్చుకొని తమ యిచ్చదీరునంతదాక వారి యెడ నవ్యాజ గౌరవంబుం జూపి యవ్వల వారిగతుల నారయక వేడికుండ విడచినటుల విడచుట పురుషజాతికి సైజమైయున్నది. చాలుం జాలు నన్నీలాగు బేలుపుచ్చి నీజనరాండ్రయొద్దం బరిహాస భాజనంబుగా నొనర్పం దలంచితివా.

**శివు:**—(సమీపించి ప్రేమతో) బేలా నాయతివలు నీకేమైన యవినయ మొనర్తురని సంశయించుచుంటివా! నే నీవాండనై యుండ నీకు వారు నిన్నేమి యొనర్పంగలరు. కామినీమణీ! కలకాలము నీతోడి సౌఖ్యము లభించినంగాని నాసంపదలు సమృద్ధి నొందినవని తలంపను. వేయేల నీకొఱకై గంగాపార్వతులనైనను కైలాసమునైనను మిగతి నావిభవము లన్నిటినైనను వదలి నీసేవయొనర్చి ధన్యుండనయ్యెద మదవతీ!

దుర్భరంబగు మదనానలంబునఁబడి ప్రస్తుతనాయవస్థ దిలకించి యిం
చుక కరుణించి యీదీనునిం గాపాడుము (నమస్కరించును.)

**మోహి:**—(నవ్వుచు) చెలులారా? రండుపోవుదము (నిష్క్రమించును.)

**శివు:**—(మోహినింగాంచక దుఃఖముతో) హా! మోసగించి పోనేపోయి
నదిగా. అయ్యో! ఎంతకఠినురాలాయింతి పాదములంబడి వేడు
కొనినను కరుణింపదయ్యెఁగా. కట్టా! కఠోరంబులగు మారుని నిశిత
శరాఘాతంబులచే నాహృదయము వ్రయ్యలైపోవుచున్నది. మర్త్యాం
డనైయున్నచో నాటక్కరి కెరక్కాడి పాదసన్నిధియందు
నామానసముతోపాటు ప్రాణములంగూడ నర్పించి దానికిఁ గన్నుల
పండువు! సేయుదుఁగదా నాకట్టి యదృష్టమునకుఁ గరవయ్యె.

ఉ. హాలలితాంగి! హా వికసి । తాంబుజ పత్రవిశాలనేత్రి హా
బాలమరాళయాన నను। బాస్మరు సీవిరహాబ్ధిఁ ద్రోయుచుౕ
జాలియొకింతలేక పెలు। చౕ గనుబ్రామితి నక్కటక్కటా
తాళఁగజాల నీవిరహ । తాపము నేగతినోర్తు నయ్యయో!
ఇఁక నేదాని మరువఁజాల యీ నావిభవములన్నియుఁ ద్యజించి దాని
సాన్నిధ్యముంబడయుటకై ప్రయత్నించెద. (నిష్క్రమించును.)



## షష్ఠాంకము—తృతీయరంగము.

---

(సరోవర ప్రాంతభూమి.)

**శివు:**—(ప్రవేశించి పురోభాగంబులకు దృష్టులునిగుడ్చి సంతసముతో)
అదిగో యాకోలన వలువలేక తనతోటి చెలులతో జలకేళిం దేలు
చున్నదాయెలనాగ పెక్కుమార్లు నన్నుంగికురించి కడుచిక్కులం

బెట్టి చక్కంజనిన యాటక్కరికత్తె యీ కొలన నాచేఁ జిక్కనది బళే! ఇదే మంచి సమయము. (పరిక్రమించును.) (తెరలో) ఓ కైలాసవాసా!

ఉ. దాకొనువేడ్క నీకొలను । దానిని సేతుణ లేకతంబునన్
కోకలు సూడ్చి నీరముల । గొంటివిహార మొనర్పఁగాంచి నీ
వీకరణిన్ మముం దరిసి । నేమియు నగ్గలార మీదెసన్
రాకు పరాకు నీకనుల । నాపు నొనర్చుట మంచినాయమే.

ఇఁక క్షణమోపికఁ బూను నావల నీకోర్కి చక్కంబడును.

శివు:—(జాణతనముతో) కాంతా! ఎంతగట్టిదానవే చిక్కనటుల దక్కినటుల నక్కడక్కడ గనుపించుచు నన్నేమరింపఁ జూచెదవా యీ తీరునఁ జేరఁజ లేక నీరంబులం జేరి విహారంబులొనర్చు నిన్ను బలిమి మెయింబట్టిన నేరీతిఁ దప్పించుకొనంగలవు. (తెరలో)

మహాదేవా! కంటిరే చేసినమేసినఁ గాపేమి చేయంగలండు నీవే మియొనర్చినను గాదనువా రిజగంబులం గలరా!

శివు:—సగర్వముగా నిప్పటికైన నా గొప్పతనం బెఱింగితివిగదా! (తెరలో) ఎఱుంగకేమి యెఱింగియే యీరీతి మఱుంగుపడుట.

శివు:—(కొలని వలనికిం జూచి) కట్టా! యీ మాయలాడి యిచ్చోటఁ గూడ నన్ను మోసపుచ్చినదే. వలువలేక జలకంబులాడుచు నా రాకవారించు నావారిజానన మాటుందోసి పుచ్చి డాయంబోయిన రసభంగముగా నుండు నని తలఁచి యీకొలని కెలన నాకలువకంటి రాకకై వేచి యుంటి తుదకిటఁగూడ విఫలమనోరథుండనైతి హా! ఆయిందుముఖి సుందర వదనారవిందంబుఁ గానుపింపక పోవుటచే నీ ప్రపంచమంత యు నంధకారబంధురమైయున్నది. అయ్యయ్యో! ఆతొయ్యలి యెయ్యెడ కేగియుండును. యెందుబోవు నిపుడా లతాంగి కొలను

వెలువడిన యలుకను తెలియదయ్యె. ఆదండి కిఁ గనుబొమ్మ నేర్పుతో పాటు జలస్తంభన విద్యగూడ కలిగి యున్నట్లున్నది. యిపుడా పులుమాయలాడి యీ కొలను నే దాగియుంటాను, ఇక నేనీ కొలని యిలంబెళ్లఁ గలంచి యీ హాలంతుక జాడ నెఱింగెద.



## షష్ఠాంకము — తృతీయరంగము.

---

(ఉద్యానమునందలి లతానికుంజము మోహిని మనోరమా చంద్రికా విలాసవతులతోఁ బ్రవేశింతురు.)

మనో:—సఖీ! ఇదిగో మారుని మెప్పింప నీవేరి తెమ్మనిన మనోహరంబులగు పారిజాతంబులు. వీటిఁ గొని త్రిలోకవిజయుండగు నాతనిం బూజింపుము. (అని పువ్వుల నిచ్చును.)

చంద్ర:—చెలీ! ఇందిరానందనున కర్చనంబులౌ నవ్య నిందీవరంబులం దెచ్చితి నిఁక నా మారుని చిత్తమునలంచిన దొరం బూజించి సఫలమనోరథల మగుదము. రమ్ము. (కుసుమములనొసంగును.)

విలా:—నెచ్చెలీ! కమ్మని తెమ్మెరలం జిమ్ము నీయుటజమ్మునఁ బుష్పోడితిన్నియపై రతీసమేతుండగు నా కమ్మవిలుకాని నాశ్రయించితి. ఇఁక జాలమొనర్పక యద్దేవదేవునకు సకలోపచారములతో సుమాంజలుల నొసఁగి పూజింతము రమ్ము. (అందఱు పూవింటిరేనిపైఁ బుష్పములం జల్లుదురు.)

మోహి:—(హారతి నొసంగుచు)

తే. జయము రతివల్లభుని బాహు ♦ శౌర్యమునకు
జయము పరిపూర్ణ శారదా ♦ చంద్రునకును

జయము శుక పిక శారికా ♦ సంతతులకు
జయము మలయాసమీరుని ♦ చెలువకెపుడు.

శివు:—(ప్రవేశించి) కాంతామణీ! యింతలోఁ గానవేనీవు.

మోహి:—బాగుబాగు మాయిచ్ఛవచ్చినట్లు శివనయన నెచ్చెలులంగూడి విహరించుచుంటిమి. ఇందుఁగానతనమేమున్నది.

శివు:—అంత మాత్రిమా?

ఉ. బాళిఁజెలంగి నీపయిని ♦ బాకజశాయిని బాణ నహ్నికిన్
దాళఁగలేక నీయనుఁగు ♦ పద్మలనంటి నమస్కరించు మన్
హాళిని నేలుమన్న మఱి ♦ నంతయునన్ గృహంబునాన వెంతగ
య్యాళివె బాలికామణియహో! నిను మెచ్చఁగవచ్చునిచ్చలున్.

మోహి:—ఉమాపతీ! ఇవియేటి నెత్తిమాటలు. కనులఁబడిన వనితలనెల్ల వలఁచి వారివెంబడింబడి వెడగుకరణిఁ దిరుగు నీవిధంబుంగాంచినచో బ్రహ్మాదిదేవతలు మహాదేవుండవని నిన్నుఁ బూజింతురా? పైని స్త్రీలోలుండవని గూడ పరిహసింపరా!

శివు:—(వెడనవ్వునవ్వి) ఇందుముఖీ! వారిబుజువర్తనలకు నన్నుఁగేలి చేయుదురుగా. ఆత్మజాతను నాలిఁజేసికొనిన యనఘచరితుఁడు చతుర్ముఖుఁడు. సఖీ! పరాకుమాని వినుచుండువా గౌతమాంగనకై కెలఁచిన ఘనుఁడు నిర్జరేశుఁడు. అన్నయాలింబట్టిన యార్యసమ్మతుఁడు సురాచార్యుఁడు. గురుని యిల్లాలింగూడిన గుణవంతుఁడు తారాపతి సుదతీ యింకనెవ్వరైన నాక్షేపించువారలున్న సెలవిమ్ము.

మోహి:—భవానీశా! పరసతులంగవయ నెంచుట పాపమునకు హేతువుగాదా?

శివు:— మనంబును సంతసింపఁజేసికొనఁ బూనుట పాపమా? "ఆనందో బ్రహ్మ" మటన్న పాత్రిజనుపుల యర్థంబు నూహింపవా!

మోహి:—తనసతిం దక్క నితరసతులం జూచి తల్లులవలెం దలంపవలయునని వచించు శాస్త్రజ్ఞుల వచనంబు లప్రమాణములా!

శివు:—కామశాస్త్రమునందలి సారస్యమంతయు స్వానుభవముచే నెఱింగి యవ్వల నితరశాస్త్రంబులం దలపెట్టవలయు.

మోహి:—యోగీశ్వరేశ్వరుండవగు నీకుం గూడ పామరులకువలెం గామశాస్త్ర విచారంబు దగునా!

శివు:—రామామణీ! యీచావుయోగములన్నియుం గష్టదాయకములు, నిరర్థకములు, నిష్ప్రయోజకములు. సంయోగమను యోగ మొక్కటియే భోగదాయకము గాన మనమిప్పు డాయోగ మొనర్చి బ్రహ్మానందముం బడయుదము.

మోహి:—ఇట్టి యల్పసుఖమున కాసించిన నలభ్యంబులగు జ్ఞానభక్తి వైరాగ్యంబులన్నియు నశింపవా!

శివు:—సిరిరా మోకాలొడ్డినవాని చందంబున నీబోటి బోటిమిన్న సన్నిధి నేకతంబయుండ నిష్ప్రయోజనంబులగు జ్ఞానవైరాగ్యంబులు దలంచి యూరక నిన్నుం బోనిచ్చుటకు నేనంత మోరకుఁడనని తలంచితివా? ఇఁక నిట్టి యడ్డుమాటలం జాలించి నీయాలింగనం బొసంగి మన్నింపుము. (సమీపించును.)

మోహి:—(తొలఁగి)

మ. భళి యీలాగున నన్యకామినులకై ♦ పల్మాఱుఁ జిత్తంబునన్
వలపుల్ జెంది కలంగు నిన్గనిన నె ♦ వ్వారైన గేల్సేయరే
జలజాక్షుం డిదిగన్న నవ్వఁడె వెసన్ ♦ జాలింపు మీపట్టు నీ
వలఘుండై కుసుమాస్త్రునిం గెలిచి యా ♦ హా! భ్రాంతినిన్ గొందువే.

శివు:—(పరిహాసముగా) ఓహో! అందులకా!

ఉ. కలికిరొ శౌరి నన్నుఁ గని ♦ కాముని బారికి నొగ్గి తాఁ జుమీ దా
బలుకుచు గేలి చేయునటె ♦ భామిని యాతఁడు బుద్ధిహీనుఁడై
పొలుపు వహించు మానినులఁ ♦ బొందఁ దలంచునె తోయజాక్షుని
యలుగుల బోఁడి పెక్కగిల ♦ నాతని సుద్దుల నెంచి మానఁగన్.

మఱి సూక్ష్మాయుధునిం బెంచితినని గారవించి లోకు లను కొందురుగాని యున్న పరమార్థము వారెఱుంగరు. ఆవిధముగా నాతనిం జయించితినను నెపమున వాని నాహృదయంబున నిల్పి భక్తిపూర స్సరముగా హరిపుత్రుండని యారాధించుచున్నాఁడను. ఇదిపరమరహస్యము (చెవి లోఁ జెప్పఁబోవును మోహిని యదృశ్యయగును.)

శివు:—హా! కష్టము కష్టము (మూర్ఛిల్లి మరల లేచి) అయ్యయ్యో! యెంత కఠిన చిత్తురాలిని వలచి బాళిం దూలనైతి నిఁక నాకది యలభ్యయని యే తోఁచుచున్నది. (పరితాపముతో) అలభ్యయైనచోఁ దాళు టెట్లు? ఎట్లైన నామాయలాఁడి పోఁడిమి యెఱింగి దానిం జేపట్టి తీరవలయును. ఆహా నాకిటు దానిజాడ లెవరెఱింగింతురు. (తరు పులను లతలను జూచి.)

సీ. పున్నాగ కానవే ♦ పుండరీకాక్షిని
తిలకంబ కానవే ♦ జలజముఖిని
మందారగానవే ♦ కుంద సుందరదంతి
చందన కంటివే ♦ జలజగంధి
చూతంబగానవే ♦ సుందరీమణి నెందు
ఘనసార కానవే ♦ ఘననితంబ
సంపెంగఁ జూచితే ♦ చంపకామోదను
కుందంబ కానవే ♦ మందగమన

తే-గీ. దంపమొసరింతు మీకు నో ♦ తరువులార
మీమఱుంగున నాయన్ను ♦ మిన్నయున్న
తగవుగా మాదలించి యా ♦ మగువతోడ
నన్ను దానిని గూర్పరే ♦ నయమువిూఱ.

విలా:—(ప్రవేశించి) యిందుధరా! యెందుల కీవందంబున నీరెండవంబునఁ గొందలమందెదవు. మాసుందరి తనడెందంబు నీయందు సొందుపఱచి కందర్పుని శరంబులచే డిందుపడి యీసుందరారామంబునందొక్క పూబందిరియందు నివసించి నిన్నుఁ బ్రార్థించి తోడితెమ్మని నన్నంపినది. మహాభాగా నావెంటదయచేయుఁడే.

శివు:—(ఆనందముతో) సుందరీ! ఆ! నాభాగ్యదేవత ప్రసన్నయై నీతోఁ జెప్పి పుచ్చిన ప్రియమైన మాటలాయివి. లేక కర్పూరంపు మూటలా! కాక యమృతంపు తేటలా! బోటీ! మఱియొక మాఱామాట నీవదాలనోట వచియింపుము.

విలా:—మాప్రియసఖి నీపొందుఁగోరి తానొక పూబోదరింటఁ గుసుమ శయ్యపై విశ్రమించి నిన్నటకుఁ దోడితెమ్మని నన్నంపినది.

శివు:—(పరమానందముతో) ఆహాహా! యేమినాభాగ్యము. కాంతా! నేఁడిట్టి శుభవర్తమానముందెచ్చిన నీకునేనేమి పసదనంబిచ్చిన నీఋణము దీఱును. ఇదిగో భక్తిపురస్సరముగాఁ బదివేలనమస్కారములు.

విలా:—(నవ్వుచు) యీనమస్కారములకు స్తోత్రపాఠములకు నవకాళ మొక గడియలోనున్నది. మహేశా! మాచెలి యిఁక నాలస్యంబు నకుం దాళదు సత్వరంబ దయచేయుము.

శివు:—(వినయముతో) మహాభాగ్యము.

విలా:—గిరీశా! యిట్టిటు.

శివు:—చిత్తము. (నిష్క్రమింతురు.)



## సప్తమాంకము—ప్రథమరంగము.

---

(నికుంజాంతరమునఁ బుష్పశయ్యపై మోహిని విశ్రమించి యుండును.)

శివు:—(ప్రవేశించును.)

మోహి:—(లేచును.)

శివు:—(వారించును)

తే॥ లేవ నేటికి ననుజూచి ♦ యోవెలంది
మెచ్చవచ్చును నినుజాల ♦ మచ్చెకంటి
వంచనను జేయ నేతువే ♦ యంచయాన
సుకారి యెంతటి జాణవే ♦ యన్నుమిన్న.

మోహి:—మహాదేవా! నీవంటి మహానుభావుఁడు మాతావున కతిథియై వచ్చినపుడు తగుసపర్యలొనర్పకుండుట మాకుంబాడియే.

శివు:—ఇంకనిట్టి టక్కరిమాటలాడి మోసపుచ్చఁజూచెదవా?

మోహి:—ఇందుమోస మేమున్నది.

శివు:—కాక మఱియేమియున్నది.

తే॥ కలికి నీమీఁది మరులుచే ♦ గాసిచెంది
కుసుమసాయకు శరములఁ ♦ గుందినొంది
వెంటఁబడి వేఁడుకొనుచుండు ♦ విటునిజూచి
యొంటిసిల నీదుమనస్సెట్లు ♦ లొప్పె నబల.

మోహి:—ఎంతతొందరగాఁడవు. అవసరగానికి వాఁకులోఁ బెట్టినాకువడిలో సే వేయుమందువు. లోకమున నెంతయాఁకలిగొన్న వారైన నొకచేత నిదానముగా భుజింతురు గాని తనయాత్రము కొలఁది యెడమచేతఁ గుడిచేత బావుకొను వారుందురా!

శివు:—సుందరీ! గ్రీష్మాతపంబున మిక్కిలి డస్సి దప్పికొనియున్న పాంథుఁడు నిర్మల వారి పూరంబగు సరోవరంబుం గాంచెనేని పరువునంబోయి తనతాపంబుఁ దీరునటుల నందవగాహనం బొనర్చి దప్పిదీఱ రెండు చేతులం గ్రోలుఁగాని నిదానముగా నాలుకతెడుపునా?

మోహి:—కైలాసవాసా! నీమాటలకు ప్రాబోటులు మారాడఁ జాలుదురే.

శివు:—వగలాడీ? నేర్చియే యుంటివి. కానిచో నడియాడియకుఁ గను పడుచుఁ గను మొఱఁగుచు నన్నీరీతి మాయనిబారికిం గుఱిచేయుదువా.

మోహి:—నేనున్న చోటనేయుంటిని. సుమనస్కులగు వారలకడఁ గను మొఱంగుట నాస్వభావముగాదు. నాయునికి నెఱుంగ నేఱక నీవేపరిభ్రమించుచుంటివి.

శివు:—కాంతా! నిక్కువమే! యీ నీ జగన్మోహన సౌందర్య సందర్శ నానంద పరవశుఁడనై భవత్సమాగమంబుఁగోరి నిరంతరము పరిభ్రమించుచునే యుంటిని. ఇఁకనైన దయయుంచి జాగుసేయక నీయధర సుధారసం బొసంగి నాదుతాపంబుఁ బాపుము. (సమీపింపఁబోవ)

మోహి:—(తప్పించుకొనుచు.) ఆ! దూరముగానుండుము.

క. నీకును మాకును బొందిక
లేకరణిఘటిల్లు వినుమ ♦ హేశ్వర బలిమిన్
బైకొన నెంచకు మీగతి
మాకడ నిలాటిచర్య ♦ మానుము శర్వా.

శివు:—(త్రోవకడ్డముగానిలచి)

క. ఎందులకుఁ బోయెదీవిఁక
యిందీవరనేత్ర నిన్ను ♦ నీక్షణమున నా
నందంబు నా మనంబున
సందడిపడఁ బొందువాఁడ ♦ సరసిజగంధీ.

(సమీపించును.) మోహిని యదృశ్యయై విష్ణుఁడై కనుపించును.
యవనిక జారును.



## సప్తమాంకము—ద్వితీయరంగము.

(విష్ణుసభామందిరము. విష్ణువు లక్ష్మి, పార్వతి శివుడు, బ్రహ్మ సరస్వతి, యింద్రాదిదేవతలు విభవమునకుఁ దగుపరివారముతోఁ బ్రవేశింతురు.)

శివు:—(నిట్టూర్పుపుచ్చి)

ఆ వె. హరియొనర్చిన మాయల ♦ నరయలేక
మహితయోగంబువిడనాడి ♦ మరులునొంది
చూచువారలలోఁ గడు ♦ చులకనైతి
హరికి నెదురాడి తప్పల ♦ మందినాఁడ.

(విష్ణుని సమీపించి వినయముతో.)

ఉ. శ్రీరమణీశ నీమహిమ ♦ చిత్తము ... నేర కే నహం
కారముఁబూని నీసాగసుకన్నియ ... జూడఁగోరియా
తీరున జాలినొంద నయితి ... సుర ... పదాబ్జ నన్నిఁకన్
గారవమొప్ప బ్రోవు నవ ♦ క ... ౯, భక్తరక్షణా.

విష్ణు:—(నవ్వుచు శివునిపైఁ జేయువైచి) గిరీశా! ...దినచో శంగయు నంద తన్న నడుగులు పట్టి యెదటివారల వశమొనర్చుకొనుట. నీకు నెన్నతోఁ బెట్టిన విద్యవలెనున్నది.

శివు:—(అవనత ముఖుండైయుండును.)

పార్వ:—(నవ్వుచు) అన్నా! కరంబు సింగారంబగు తరుణీరూపుఁదాల్చి నీముద్దుమరంది నెన్ని తెఱంగుల మరులొందఁ జేసితివి.

విష్ణు:—(నవ్వుచు) ఆర్యా! అపుడపుడింత మాత్రము వినోదములంజూపె యలంపకున్నచో నీకొండ వీటి జంగముదేవరకు మనము జ్ఞప్తి యందుండుమా.

నార:—(సంతోషముతో నృత్యమొనర్చుచు.)

సీ. జయ రమా హృదయేశ ♦ జయదానవ వినాశ
జయవిహంగ తురంగ ♦ జయశుభాంగ
జయభోగి వరతల్ప ♦ జయసత్య సంకల్ప
జయయోగి జనవంద్య ♦ జయ ముకుంద
జయసర్వలోకేశ ♦ జయకౌస్తుభ విభూష
జయదీనవత్సల ♦ జయకృపాళు
జయ పంకజోదర ♦ జయసన్నుతామర
జయ గదాధర కృష్ణ ♦ చక్రహస్త.

తే॥ భక్తపరిపాల నాదగు ♦ పద్దుదీర్చి
సంతసంబునుగూర్చితి ♦ సత్యనిలయ
లోకముల రక్షణముచేయు ♦ శ్రీకళత్రి
నిన్నువినుతింపనేర్తుమే ♦ నిఖిలవేద్య

విష్ణు:—నారదా! యీశంభుండుమాత్రము సామాన్యుండని తలంచుచుంటి వా? ఆతండు మత్సముండనియే యెఱుంగుము.

నార:—మహాప్రసాదము.

విష్ణు:—ఉమాపతీ! ఇంకను విన్నదనంబు వహించియేయుంటివా.

శివు:—దేవా! మహానుభావా! నీయనుగ్రహము మాయందు గల్గినదిగదా యిఁక నావిన్నదనంబంతయుఁదీరినది.

గీ॥ అతిప్రసూనుని తీవ్రశా ♦ పాగ్నివలన
విభవములు గాలిపోయిన ♦ విబుధపతిని
మరల స్వారాజ్యముననిల్పి ♦ మనిచినట్టి
భక్తపరిపాల! శ్రీలోల ♦ భర్మచేల. (నమస్కరించును

విష్ణు:—(శివునిగౌఁగలించి) ఈశానా! ఈనవ్వులాటల విలాసములకై యింత విన్నదనమొంద నేల. నేఁదాల్చిన మదవతీరూపంబుంజూచి నీవింత వఱకు దిటవూనితివిగాని యన్యులైనచోఁ దమమానసంబు లొక్క క్షణమైన నిల్పుకొనఁగలరా. ఇంతమాత్రమునకేల నీరీతి మోము వాంచియుందువు. నేనన్యుండనా? మనలోమనకేమి భేదము?

శివు:—(చేతులుజోడించి భక్తితో) దేవా! ధన్యుండనైతి. భవత్కరుణావిశేషమున నాయహంకారమంతయు నశించె.

విష్ణు:—ఈశానా! నీవుచూడ మచ్చటపడిన నామచ్చెకంటి రూపముం జూపి నీకోర్కెందీర్చితి. ఇంకనేమైన గోర్కెలున్నఁ దెల్పుము.

శివు:—దేవా! మీయనుగ్రహంబున నన్నియుఁ జేకురినవి. అయిననిట్లగుగాక.

భరతవాక్యము.— తే॥ గీ॥ ధరణి సకలసుఖంబులఁ ♦ దనరుఁ గాక
ధర్మమున నేలుదురుగాక ♦ ధరణివిభులు
పాడిపంటలచే భువి ♦ ప్రబలుగాక
కవులగ్రంథంబులకువన్నె ♦ గల్గుగాక.

విష్ణు:—తథాస్తు. (అందఱునిష్క్రమింతురు.)

ఇది శ్రీ చిల్కపాటి సీతాంబా ప్రణీతంబగు
సముద్ర మథనంబను విష్ణుమాయా
విలాస నాటకము సర్వంబును
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ